# సృజన

1978 జనవరి | మాసపత్రిక | 75



ఉప్పెనపై ఒక రిపోర్టు – పరిశీలకుడు 65వ పేజీ

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**75**

జనవరి 1978

---

సృజన పాఠకులకు, రచయితలకు, చందాదార్లకు, పోషకులకు,
అభిమానులకు, విమర్శకులకు
పీడన, దోపిడీ, అసమానతలు లేని నూతన ప్రజాస్వామ్య వ్యవస్థకోసం
శాస్త్రీయంగా పోరాటం కొనసాగిస్తున్న వారికి
ప్రజలకు, ప్రజాపక్షం వహించిన వారికి
నూతన సంవత్సర విప్లవాభినందనలు.

---

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

---

సంవత్సరం చందా రు. 15 ఈ సంచిక రు. 1-50

# 'పసివాడు'

చార్లీ చాప్లిన్ చనిపోయాడు. మూకీల నుండి టాకీలదాకా మూగ భావాలకు సంచలనం నేర్పిన చార్లీ. కన్నీళ్ళకు గలగల నవ్వడం నేర్పిన చాప్లిన్— కడుపులో విషాద సముద్రాల బడబాగ్నులు దాచుకొని నడకలో నవ్వుల కెరటాలను సృష్టించిన— 'సినీరంగంలోని జీనియస్' చనిపోయాడు. జీవితానికి కరుణా హాస్యమూ బొమ్మా బొరుసని— ఏడుపూ నవ్వూ చీకటి వెలుగులని బొమ్మకట్టి చూపిన తాత్వికుడు. గొంతు దాకా నీళ్ళలో మునిగిన తామర తనపై నీటిచుక్కను ముత్యంలా మెరిపించినట్లుగా కంట్లో కన్నీరు దాచుకుని హాస్యాన్ని కురిపించి కష్టాలను మరిపించిన మానవతావాది మరణించాడు. తన జీవితంలోని చేదు అనుభవాలు, ద్వేషం. అనాదరణ, క్రౌర్యం, దారిద్ర్యం— వీటితో పెనుగులాడి, పోరాడి ఏడవలేక నవ్వినపుడు అతనిలో పుట్టిన కళాకారుడు ఈ అన్నింటినీ జయించాడు. అందుకే దారిద్ర్యం, అవమానత, పీడన, క్రౌర్యం లేని సమాజంకోసం కలలుకని కళలుకని దేశంనుంచి దేశానికి తరుమబడి దేశదేశాల్లో స్వేచ్ఛకోరే జనం హృదయాల్లో స్థిరపడ్డాడు చిరస్థాయిగా.

అవును నిజం— యుద్ధాలు లేకుండా చేయడానికి యుద్ధంలోకి దిగింది అమెరికా; రూజ్వెల్టు మాటలు కాసేపటికి రుజువయినవే ననుకుంటే. హిట్లర్ ఫాసిజాన్ని భంగపరచిన కమ్యూనిజంతో కాసేపటికి చేతులు కలిపింది. (గుండెల్లో 'కమ్యూని[illegible] భూతం' అప్పటికే గుబులు కొలుపుతూనే వున్నది) అక్కడ తీశాడు చాప్లిన్ '(గ్ర[illegible] డిక్టేటర్'— హిట్లర్‌ను వెక్కిరిస్తూ నాజీజాన్ని నిరసిస్తూ. ఆ 'స్వేచ్ఛప్రియ' అమెరి[illegible] ఖండం 'కమ్యూనిస్టు గత్తర' తగిలిన కళాకారుణ్ణి దేశం నుంచి బహిష్కరించింది।

చాప్లిన్ కళాకారుడు— అక్షరాలా. 'దికిడ్' అనే చిత్రంలో ఒక అనాథబాలుణ్ణి పెంచుకుంటాడు. తనకే ఒక ఆశ్రయం లేదు. ఆధారం లేదు. ఆ బిడ్డనెట్లా పోషిస్తాడు పడరానిపాట్లు పడతాడు. ఒక ఆలోచన తడుతుంది— తాను అద్దాలు పగిలిపోయిన కిటికీలను బాగుచేసే వృత్తి స్వీకరిస్తాడు. అద్దాలు ఎవరు పగలగొట్టాలి— ఆ పిల్లవాడు. ముందువాడు సందు తిరిగితే తాను. ఇద్దరినీ పసిగట్టి పోలీసువాడు. చాప్లిన్ అవస్థ చూసి తీరవలసిందే.

మన ఆలోచనల కిటికీలను బాగుచేయాలని ప్రయత్నిస్తున్న కళాకారులను ఈ పోలీసు వ్యవస్థ ఒక కంటకాదు వెయ్యికళ్ళతో కనిపెడుతున్నది.

ఆకలి క్రూరమైంది. ఆకలిని జయించడానికి ఆదిమ మానవునినుంచి అణుమానవునిదాకా సాగివచ్చిన పోరాటప్రయాణాన్ని నాగరికత అని పిలుస్తున్నాం. ఈనాగరికత పరిణామంలో దోపిడీ స్వభావం ఒక్కటే అనాగరిక అవశేషం. నిత్యమూ జీవించడానికి మనిషిచేసే పోరాటం నిజంగా ఎంత సజీవమైన కళ. చచ్చిన చాప్లిన్‌కు 'సర్' బిరుద మొక్కటే మచ్చ. మన మధ్యకళాకారుడుగా బతుకుతున్న చాప్లిన్‌కు బిరుదులూ లేవు, చావూ లేదు

—సంపాదకుడు.

# పాత్రికేయులపై దౌర్జన్యం

న్యాయమైన తమ కోర్కెల సాధనకు కొంతకాలం కిందట సమ్మెచేసిన 'ఈనాడు' జర్నలిస్టులు, వర్కర్లలో 37 మందిని మేనేజ్‌మెంట్ సస్పెన్షన్‌లో ఉంచిన విషయం అందరికీ తెలిసినదే. ఇటీవలే అసత్య ఆరోపణలతో మరో ఆరుగురు కార్మికులను 'ఈనాడు' మేనేజ్‌మెంట్ సస్పెండ్‌చేసి తన కార్మిక వ్యతిరేక ధోరణిని మరోసారి చాటుకుంది.

ఎప్పటిలాగానే జీతాలు (సస్పెన్షన్ అలవెన్స్) తీసుకోవడానికి సస్పెన్షన్‌లో ఉన్న జర్నలిస్టులు, వర్కర్లు ఆఫీసుకి వెళ్ళారు. అప్పటికే లోపలా, బయటా మేనేజ్‌మెంట్ తెచ్చిన కిరాయిగూండాలు చేతిలో లాఠీలతో కాపువేశారు. మేనేజ్‌మెంట్ మనుషులు ఉద్యోగులతో అకారణంగా వాగ్వివాదం పెట్టుకుని, వారు సమాధానమిచ్చే లోగా చేయిచేసుకున్నారు. ఈ అవకాశం కోసమే కాచుక్కూర్చున్న కిరాయిగూండాలు వర్కర్లు, జర్నలిస్టులందరిపై మెరుపుదాడి చేసి, లాఠీలతో విచక్షణారహితంగా రక్తం కారేలా చావబాదారు

నిస్సహాయులైన జర్నలిస్టులు, కార్మికులు చేతులు అడ్డుపెట్టుకుని దెబ్బల్ని భరించడం మినహా గత్యంతరం లేకపోయింది. చివరికి వాళ్ళ కసితీరేవరకూ కొట్టి ...ని రోడ్డుమీదవరకూ తరిమితరిమి మరీబాదారు. ఈ దమనకాండలో, సస్పెన్షన్‌లో ...న్న న్యూస్ ఎడిటర్, రాష్ట్ర వర్కింగు జర్నలిస్టుల యూనియన్ ఉపాధ్యక్షుడు ... సుబ్బారాయుడు తలపగిలి రక్తం ధారలు కట్టింది. వర్కర్ శ్రీ సీతారామ్ కంటి ప్రక్కన బలమైన గాయం తగిలింది. శ్రీ పరబ్రహ్మమూర్తి, శ్రీ సత్యనారాయణ, మిగతా కార్మికులందరికీ కూడా బలమైన దెబ్బలు తగిలాయి

జీతం తీసుకోడానికి లోపలికి వెళ్ళి, ఈ గొడవలో బయటికి రాలేకపోయిన సబ్ ఎడిటర్ కుమారి రత్నమాలను మేనేజ్‌మెంట్ మనుషులు జుట్టు పట్టుకుని బరబరా బయటకి ఈడ్చారు. కిందపడేట్టు తోసివేశారు. టర్క్‌మన్ గేటు ఉదంతాన్ని గుర్తుకు తెచ్చిన ఈ దమనకాండలో దెబ్బలు తగలకుండా బయటపడిన జర్నలిస్టుగానీ, వర్కరుగానీ, ఒక్కరుకూడా లేరు: తీవ్రగాయాలు తగిలిన శ్రీ సుబ్బారాయుడిని ఉస్మానియా ఆస్పత్రి. ఎమర్జన్సీ వార్డులో చేర్చారు.

న్యాయమైన కోర్కెల సాధనకు రక్తం చిందించికూడా శాంతియుత పోరాటం జరుపుతున్న 'ఈనాడు' జర్నలిస్టులకు, కార్మికులకు బాసటగా నిలిచి, పూర్తి సహాయ సహకారాలను అందజేయవలసిందిగా ప్రతి ఒక్కరినీ కోరుతున్నాము. ప్రజాతంత్ర వాదులు, మేధావులు, యన్.జీ.వో.లు అన్ని రాజకీయపక్షాలు-కార్మికసంఘాలు, విద్యార్థి సంఘాలు ఒకరేమిటి యావత్ ప్రజ కదలి. ముక్తకంఠంతో పత్రికా సిబ్బందిపై 'ఈనాడు' మేనేజ్‌మెంట్ జరిపిన దమనకాండను ఖండించవలసిందిగా కోరుచున్నాము.

హైదరాబాద్,
2-1-1978.

'ఈనాడు' ఎంప్లాయీస్ యూనియన్

5

## 'ఆకాశంలో అరుణకాంతులై...'

— అరుణతార

| | | |
|---|---|---|
| జీపీమీదా జీపీవచ్చె | అన్నల్లారా | |
| జీపీలోనా పోలీసొచ్చే | అక్కల్లారా | |
| లారీమీదా లారీవచ్చే | అన్నల్లారా | |
| లారీనిండా తుపాకులొచ్చే | అక్కల్లారా | |
| తూరుపు ఎర్రబడకముందే | అన్నలారా | |
| కలతనిదుర చెదరకముందే | ఓ. .అక్కల్లారా | ॥జీపీ॥ |
| ఈగాథ ఆలకించుడీ | ఓ...అన్నలారా | |
| ఈ ఘోరం చూడండమ్మా | ఓ...అక్కల్లారా | |
| ఇందిరమ్మా ఎమర్జెన్సీలో | అన్నలారా | |
| వెంగళరావూ హుకుంజారితో | అక్కలారా | |
| హైదరాబాదూ నడిబొడ్డునా | అన్నల్లారా | |
| మలక్‌పేటా ప్రాంతానా | అక్కల్లారా | |
| అక్టోబర్ ముప్పైఒకటీనా | అన్నలారా | |
| పందొమ్మిదివందల డెబ్బైఆరులోనా | అక్కల్లారా | |
| తూరుపు ఎర్రబడకముందే | అన్నల్లారా | |
| కలతనిదుర చెదరకముందే | ఓ...అక్కల్లారా | ॥జీపీ॥ |
| రామా నర్సయ్యా | అన్నల్లారా | |
| జానకిరాంరెడ్డీ | అక్కల్లారా | |
| విశ్వనాథమూ | అన్నల్లారా | |
| టీచర్ నారాయణా | అక్కలారా | |
| పక్కలమీదా వున్నవారినీ | అన్నలారా | |
| ఇనుపబూట్లతో ఎగిరిదన్నిరా | అక్కల్లారా | |
| బేడిలమీదా బేడీలేసీ | అన్నల్లారా | |
| జీపుల్లోకి నెట్టివేసిరా | అక్కలారా | |
| తూరుపు ఎర్రబడకముందే | అన్నల్లారా | |
| కలతనిదుర చెదరకముందే | ఓ...అక్కల్లారా | ॥జీపీ॥ |
| మీపార్టీ వారందరూ | ఓ...అన్నల్లారా | |
| ఎక్కడెక్కడున్నారనిరా | ఓ...అక్కల్లారా | |

మా పర్కారుకు మీరంతా ఓ...అన్నల్లారా
లొంగి పోవాలన్నారా ఓ...అక్కల్లారా ॥జీపీ॥

విప్లవవీరులు యిది విన్నారూ అన్నల్లారా
వుగ్ర నరసింహాలై నారూ అక్కల్లారా
తుపాకులకు తూటాలకు మేమూ అన్నల్లారా
పోలీసూ మిలటరీకి మేమూ అక్కల్లారా
మిన్నుమన్ను లేకమైనగానీ అన్నల్లారా
సూర్యచంద్రు లొక్కటైనగానీ అక్కల్లారా
బెదరబోమన్నారా
పోరు విడువమన్నారా
ప్రజలే మా ప్రాణమన్నారా అన్నల్లారా
పార్టే మా వూపిరన్నారా అక్కల్లారా ॥జీపీ॥

బట్టలన్నీ వూడదీసీ అన్నల్లారా
వెల్లాకీలా పడుకోబెట్టీ అక్కల్లారా
రొమ్ముల్లో సూదులుగుచ్చిరా ఓ...అన్నలారా
పెయ్యంత వాతలు బెట్టిరా ఓ...అక్కలారా
కాళ్ళనుండి చేతులనుంచీ ఓ...అన్నలారా
కాల్వలుగట్టె రక్తమంతా అక్కలారా
పెయిలనిండ రక్తమాయెరా ఓ...అన్నలారా
మూర్ఛబోయినా నలుగురన్నలూ అక్కలారా
కొట్టనిచోటు లేనేలేదూ అన్నలారా
పెట్టని హింసా లేనేలేదూ అక్కలారా ॥జీపీ॥

నవంబర్ ఒకటవ తేదీనా అన్నలారా
మునిమాపు రాతిరిలోనా ఓ...అక్కలారా
వరంగల్ జిల్లాలోనా ఓ...అన్నలారా
పాకాలా చెరువుదగ్గరా ఓ...అక్కలారా
చిలకలగుట్టా అడవిలోనా అన్నలారా
తూరుపు ఎర్రబడకముందే అక్కలారా
కలతనిదుర చెదరకముందే ఓ...అన్నలారా ॥జీపీ॥

గిరిజన రైతాంగ ప్రజలకూ ఓ...అన్నలారా
కూలినాలి పేదప్రజలకూ ఓ...అక్కలారా
వెలుగుబాట చూపినోళ్ళనూ ఓ...అన్నలారా
పోరాటం నేర్పినోళ్ళనూ ఓ...అక్కలారా
సర్కారు గుండెల్లోనా ఓ...అన్నలారా
భూకంపం లేపినోళ్ళనూ ఓ...అక్కలారా
భూస్వాముల కెదురునిల్చి ఓ ..అన్నలారా
పోరాడిన వీరులానూ ఓ...అక్కలారా
రెక్కలిరిచి చెట్లకుగట్టీ ఓ...అన్నలారా
కాల్చివేసిరా హంతకులూ ఓ...అక్కలారా ॥జీపీ॥

అడివంతా దద్దరిల్లెనా ఓ...అన్నలారా
నెత్తుటితో తడిసిపోయెనా ఓ...అక్కలారా
ప్రతికొమ్మా ప్రతిరెమ్మా
ప్రతికొండా ప్రతికోనా
కలతజెందెనా కన్నీరుబెట్టెనా ॥జీపీ॥

ములుగు ప్రాంతములోని ప్రజలూ అన్నలారా
పొలాలల్లో కలుసుకొన్నరా ఓ...అక్కలారా
జరిగింది తలుచుకొన్నతా ఓ...అన్నలారా
ప్రతి తల్లీ ప్రతి తండ్రీ

ప్రతి అన్నా ప్రతి చెల్లీ
ఎదల్లోనా ఎదలుబెట్టిరా ఓ...అక్కలారా
రాత్రంతా ఏడ్చారురా ఓ...అన్నలారా
అట్టుడికి పోయారురా ఓ...అక్కలారా
అగ్నికణా లయ్యారురా ఓ...అన్నలారా ॥జీపీ॥

ఈ మారణ హోమాన్నీ
ఈ దారుణ ఘోరాన్నీ
జరిపించిన ప్రభుత్వాన్నీ
జరిపించిన వెంగళ్రావునూ

ఎదిరించగ నడవాలిరా ఓ...అన్నలారా
కదలివోలె పొంగాలిరా ఓ...అక్కలారా
కార్మికులూ కర్షకులూ
విద్యార్థులూ మేధావులూ
నవతరమూ యువతరమూ
నరనరమూ వురుమాలిరా ఓ...అన్నలారా
ఒక్కటై పోరాలిరా ఓ...అక్కలారా ॥జీపీ॥

## భూమి తల్లి స్నానానికి

హనుమంతరెడ్డి

నా జనం ప్రశ్నిస్తోంది
రాళ్ళూ రప్పలూ
గుండెల నిప్పులూ వర్షిస్తోంది.
యవ్వనం
బుల్లెటను ప్రశ్నిస్తోంది.
అహో, అదేమిటి?
మురిక్కాల్వలో
కాగితాల ఏడుపు
ప్రశ్న పత్రాల్లో
ప్రశ్నలకు జవాబులు
ప్రశ్నలే—
తనలో తాను వుడికుడికి పోయింది
వాల్కానో.
ఎన్నాళ్ళు?
బద్దలై పోయింది. చిమ్మింది అగ్ని.
ఇక మిగిలిందొక్కటే,
ఆఖరు కోర—
పోలీసులు—
ఆ రోడ్లమీద
నెత్తురెందుకు పులిమారు?
అడివి చెట్లమీద
తుడిచినా చెరగవి నెత్తుటిగుర్తులు?
వారు నల్లవి
తమ నలుపును దాచుకోడానికి
దగ్గరిదారి.
కాని/ఇది దాగేనా?
ఇది/ఇంతటితో ఆగేనా?
ఇంక్విలాబ్ జిందాబాద్
శత్రూ, నీమృత్యువు కిదే బర్త్ డే.
ఎగిరే బంతులు, బడబాగ్నులు
రగిలే పగడాలు, కాగడాలు
విద్యార్థుల, యువకుల
కార్మికుల, కర్షకుల
ధమనుల్లో లావా నదులు
నదులన్నీ రక్తంతో పొంగెను.
జనసముద్ర ముప్పొంగెను
హే/భూమితల్లీ
లే/స్నానానికి.

# గాజు కళ్లలో జీరలు

పప్పుల వెంకటేశ్వర్లు

నైరాశ్యంతో నేను.—

పట్నపు ఇరుకుసందుల జీవితాలలో
పల్లెల పీడిత పేదబ్రతుకుల్లో,
నా ప్రియతమ ప్రజలమధ్య
పిచ్చిపిచ్చిగా తిరుగుతున్నా.
ముడుతలుపడ్డ వాళ్ళ ముఖాల్లో
ముసిరివున్న భావాల్ని చదువుతున్నా.
వ్యథాతప్త హృదయులైన ఆ నా వార్ని
ప్రేమతో పరామర్శించాలనుకొంటూ కూడా
చేతకాక వూరుకొంటున్నా.

అయితే—

వాళ్ళకళ్ళల్లోని ఆ "జీర"లు చూసి
జీవితంమీద మళ్ళీ ఆశలు పెంచుకొంటున్నా!
మొక్కవోయిన విశ్వాసానికి మళ్ళీ
పదును పెడుతున్నా!
నలిగి– నలిగి– చితికిపోయిన
ఎన్నెన్ని భారమైన బ్రతుకులు!
ఏడ్చిఏడ్చి– కన్నీళ్ళు కార్చికార్చి
ఎండిపోయి– వెలవెలబోతున్న
ఎన్నెన్ని గాజుకళ్ళు!!
పగిలి చారలుపడ్డ ఆ గాజుకళ్ళల్లో
హృదయ గతమైన ఆవేశాన్నీ,
గుండెల్లో మండేమంటల వేడినీ,
కర్తవ్యోన్ముఖులవుతున్న వారి దృఢసంకల్పాన్నీ
ప్రతిబింబిస్తూ ప్రగాఢమవుతున్న ఆ జీరలు...
ఎంతటి చిక్కని ఎర్రని జీరలు !!

# బావి

సిఎచ్. మధు

ఆదివారం.

ఎండకాలం

మిట్ట మధ్యాహ్నం

ఊరు పేరు లక్ష్మీపురం

ఊరుకు పేరుకు సంబంధమేమిటి?— ఆ ఊరులో వున్న చిన్న రచయిత ఒక సారి అంటాడు. "గ్రామంలోని పది ఇళ్ళను వేరుచేసి దానికి లక్ష్మీపురమని— మిగుతా నాలుగు వందలు వేరుచేసి 'బీదలవాడ' అనాలని"—

మిట్ట మధ్యాహ్నం

ఎండకాలం

ఆవేళ—

ఊరుకు రోడ్డు పక్కన చెట్లక్రింద చాలా జనం కూర్చున్నారు. ఒక చెట్టు క్రింద కొందరు. మరో చెట్టుక్రింద కొందరు. ఇంకో చెట్టుక్రింద కొందరు.

ఒక చెట్టుక్రింద కూర్చున్న వారిలో హరిజనులుంటే— ఇంకో చెట్టు క్రింద కూర్చున్న వారిలో అన్నికులాల వారున్నారు. మరో చెట్టు నీడన హరిజన యువకులు నలుగురు కూర్చున్నారు. వాంతోబాటు హరిజన యువజన సంఘ సభ్యులు కూడా కూర్చున్నారు. చిన్న రచయిత కూడా వున్నాడు. అయితే ఆయన 'హరిజనుడు' కాదు

'నాది ఏకులంకాదు' ఆయన అంటూవుండగా ఆయన కులంతో మనకెందుకూ?—

మొత్తం మీద అందరూ మాట్లాడుకుంటున్నారు.

మొత్తంమీద అందరూ మినిష్టర్ సీతారాం కోసం ఎదిరి చూస్తున్నారు.

(సీతారామయ్య మినిష్టర్ అయిన తర్వాత సీతారాం అయ్యాడు)

సీతారామయ్య మంత్రి. హరిజన సంక్షేమ మంత్రి.

ఆనాడు వస్తానని హరిజలకు కబురు పెట్టాడు.

స్వాగత తోరణాలు మాత్రం లేవుకాని జనం ఎదిరి చూపులున్నాయి.

సీతారామయ్యది అదే ఊరు ఆ ఊరులోనే పుట్టిపెరిగాడు. అదే నియోజక వర్గం నుండి ఎం. ఎల్. ఏకు పోటీచేసి— అగ్రకులం వ్యక్తిని అంటే రావును ఓడించి గెలుపొందిన వ్యక్తి.

చాలా సార్లు ఆయన వచ్చి వెళుతుంటాడు. ఎవరూ పట్టించుకోరు. ఆయనతో అవసరమున్న వారుతప్ప.

చెట్టుక్రింద కూర్చున్న హరిజన యువకులముందు ఒక ప్రశ్న వేశాడు రచయిత "రాజీ అనేది ఉందా? సంఘర్షణ కొనసాగిద్దామా?" అని కొంత సేపాగి "ప్రసాద్! మినిష్టర్ వస్తున్నాడంటే రాజీకోసమే సంఘర్షణ కొనసాగిద్దామని ఆయన మనసులో ఉంటే ఆయన రావల్సిన అవసరం లేదు"

భాస్కర్‌బాబూ! మనకీ పంచాయితీతో అవసరమేమిటి?

"అవసరం లేదు. నిజమే. మనవాళ్ళు పెద్దలున్నారు. వాళ్ళనూ, మనలాంటి శ్రమజీవులు ఇతర కులాలతో వున్నారు వాళ్ళనూ మనవెంట లాక్కుపోవల్సిన అవసర ముంది. వారిని విడిచి పెట్టవద్దు"

కొంత సేపు చర్చించుకున్నారు. తర్వాత ప్రసాద్‌లేచి తన పెద్దలున్న హరి జనులు కూర్చున్న చెట్టుక్రింద కొచ్చి గుబురు మీసాలు, తలపాగా, చేతిలో చుట్ట, ప్రక్కకు కట్టెతో పదిమంది మధ్యన కూర్చున్న తాత వంక చూచి (తాత పేరు రామయ్య హరిజన వాడకు పెద్ద మనిషి' అని పిలుస్తారు)

"ఇదిగో మేము కుర్రికుంకలమని మామాట కొట్టిపారవేయద్దు మీకాలానికి మా కాలానికి చాలా తేడా వచ్చింది. మీరు పంచెకడితే మేము ప్యాంటు వేసుకుంటు న్నాం మీరు చదువుకోకపోతే మేము చదువుకుంటున్నాం మేము పట్నంలో చదువ టానికెళితే మమ్మల మాదిగవారిగా ఎవ్వరూ చూడరు. ఇక్కడికి వస్తే– మాదిగ వాళ్ళగా, అంటరాని వాళ్ళగా– మాకిది నచ్చదు. జరిగిన రక్తపాతమేదో జరిగింది. దానికి ప్రతిక్రియ కావాలి. మంత్రి మన వాడు కావచ్చు మన కులం కావచ్చు. మన ఊరు కావచ్చు. కాని ఈనాడు కారులో తిరుగుతున్నాడు. మేడలో ఉంటున్నాడు. మన బ్రతుకును మర్చిపోయిన ఆయన మనకు న్యాయం చేస్తాడనే నమ్మకం లేదు. ఏమైనా రాజీ, ఏదోపోనీ– అంటే మేము సహించము." అంటూ వెళ్ళిపోయాడు.

అందరూ వెళ్ళిన దిక్కే చూస్తున్నారు
''పిచ్చి నాయళ్ళు'' అన్నాడు రామయ్య
''వాడనేది నిజమే'' అన్నాడు వెంకయ్య

ప్రసాద్ పట్నంలో చదువుకుంటున్నా ఊరి సమస్యలతో చాలా సంబంధాలున్న వ్యక్తి. వేసవి సెలవులకు ఇంటి వద్దే వుంటున్నాడు.

ఈ ఊరికి మంత్రి రావాటనికి, ఒక సంఘర్షణకు వెనుక చాలా కారణా లున్నాయి.

ఊరు అంత పెద్దదీకాదు. పూర్తిగా చిన్నదీకాదు. ఐదు వందల ఇళ్ళపైనే వుంటాయి. మూడువేల పైన జనాభా ఇందులో హరిజనులవి ఎనబది ఇల్లు. ఆరు వందల జనాభా దాటేవుంటుంది.

ప్రసాద్ హరిజనుడే కాని హరిజనుల విషయంలో కొన్ని అభిప్రాయాలంటూ ఆయనకున్నాయి.

స్వాతంత్ర్యం రాకముందు హరిజనులను అంటరాని విధంగాఏ విధంగా పరిగ ణించారో–తర్వాత–కొన్ని ఏళ్ళ వరకు పెద్దమార్పు అంటూ రాలేదు. "మార్పురావాలి మార్పురావాలి అందరమూ ఒకటే" అనే ఉపన్యాసాలు వినాదాలు పెరుగటం తప్ప పెద్ద మార్పంటూ రాలేదు. పెద్ద మార్పు వస్తుందనే ఆశకూడా కనుచూపు మేరలో ఆయనకు కనిపించ లేదు. ఎందుకంటే అగ్రవర్ణాల వైఖరి ఒక కారణమైతే, ఇంకో కారణం తక్కువ జాతి వర్ణాలు కూడా తనతోపాటు శ్రమజీవులైన హరిజనులను అంట రాని వారిగానే చూశారు.

ఆ విషయాన్నే ఆ ఊరు రచయిత ఒకసారి రాస్తాడు. "స్వాతంత్ర్యం" వచ్చి ఇరువది ఏళ్ళు అయిపోయినా హరిజనులు మనవాళ్ళే అనే వైఖరి ఎక్కడా రాలేదు. పట్నాలలో ఏదోకల్పి తిరిగే మార్పు వచ్చినా– పల్లెల్లో అది కూడా రాలేదు. ముఖ్యంగా అగ్రవర్ణాల ఆలోచనల్లో ఈ మార్పు ఎక్కడా రాలేదు. అయితే పోయిన తరం అంట రాని వారిగా పరిగణిస్తే అలవాటు పడిన తరం రాజీగా ఒప్పుకుంటుంది కాని కొత్తతరం స్వాతంత్ర్యానంతరం జన్మించిన తరం ఈ అసహ్యకరమైన అంటరాని తనాన్ని ఒప్పు కొనటం లేదు"

ముఖ్యంగా ప్రసాద్‌కు ఈపల్లెలోని పరిస్థితులు ఇషంకావటంలేదు పట్నాలలో ఒక మార్పు వచ్చింది. హరిజనులెవరో అగ్రవర్ణాలవారెవరో గుర్తించటానికి వీలు లేని పరిస్థితులు వచ్చాయి. కాలేజీ, బస్సు, రైలు, ఉద్యోగాలలో కల్పి జీవిస్తున్నారు. అట్లా జీవించినా "వీడు మాలవాడు" అంటే చిన్నచూపు గమనించాడు ప్రసాద్. అంతే కాదు ఇంకోవిషయం గమనించాడు ఉన్నవారు లేనివారిని అంటరానివారుగా, తెలివి తక్కువ వారిగా నీచంగా హీనంగా చూడటం, ఒక ఆశ్చర్యకరమైన విషయం. ఇది ప్రసాద్‌కు ప్రశ్నగా మిగిలిపోయినా– రచయిత స్నేహం తర్వాత చాలా ప్రశ్నలకు

జవాబు దొరుకుతూ వుంది. ఉన్నవారు లేనివారిని నీచంగా చూస్తే లేనివారుకూడా వారిలో ఒక భాగమైన హరిజనులను ఎందుకు నీచంగా చూస్తారు? వాళ్లు వీళ్లు ఎందుకు కల్సిపోరు? ఈ ప్రశ్న చాలా కాలంనుండి ఆయన మనసులో మెదులుతూనే వుంది. దీనికి జవాబు రచయిత చెప్పాడు "ఈ ప్రపంచములో కులాలు రెండు మాత్రమేనని, ఉన్నవాళ్లు, లేనివాళ్లు, ఉన్నవాళ్లు వాళ్ళ క్షేమంకోసం లేనివాళ్ళలో ఈ విభజన కల్పించారని," దీనిలో ప్రసాదుకు అన్ని జవాబులు దొరికాయి. అంతేకాదు ఒక విశ్వాసం కూడా ఆయనకు కలిగింది. ఒకనాడు కుల, మత భేదాలు లేకుండా లేనివారంతా కల్సి పోతారని.

పట్నముకు చదువుకోసం వెళ్తున్నాడు వస్తున్నాడు. కాని ఈ పల్లెకు వచ్చినపుడెల్లా పెద్ద బాధగా వుంది. పట్నంలో తనను మాలవానిగా ఎవరూ గమనించరు. కాని తన పల్లెకొస్తే తనో అంటరానివాడు. పల్లెలలోని పరిస్థితులు ఆయనకు చాలా బాధ కలిగించేవి. ఊరి హోటళ్ళలో మాల మాదిగలు త్రాగటానికి బయట ఒకగ్లాసు అది వాళ్ళే కడుక్కోవాలి. అది హరిజనుల గ్లాసు. ఈ మాలవాళ్ళు ఎవరింటికైనా వెళితే బయట కూచోవాలి. దూరంగా నిల్చొని మాట్లాడాలి. వాళ్ళ బావి. నీళ్లు ముట్టుకోకూడదు. ఎవరైనా నీళ్లు ఎత్తుకరాగా పొరబాటున మాలవాళ్ళు తగులుతే ఆ నీళ్ళు పారపోయటం ప్రసాద్‌కు బాధగా దుఃఖంగా ఉండేది. ముఖ్యంగా హరిజనులందరిని అగ్రవర్ణాలు 'అరేయ్' అని పిలువటం, నీచంగా తిట్టటం ఆడవాళ్ళను 'ఏమే' 'ఒసే' అనటం ఇంకాపోతే ఒక్కొకసారి 'లంజా' అంటూ హీనంగా తిట్టడం బాధ, కోపం కల్గించేవి.

వీటన్నిటికి ఎప్పుడైతే జవాబు దొరికిందో రచయిత అండదండలు దొరికాయో— ప్రసాద్ ముందు ముందు అవసరమనుకొని తనలాంటి యువకులతో 'ఒక గ్రూపు' అంటూ ఏర్పాటు చేసుకోసాగాడు.

## 3

ఒకనాడు ప్రసాద్ పల్లెలోని హోటల్‌కెళ్లాడు. అది గుడిసె. లోపల కూర్చోవటానికి ఒక చాప పరిచివుంది.

ప్రసాద్ అన్న టీ త్రాగటానికి బయట కూర్చున్నాడు. ఆ హోటల్ ఒక కాపుది. వాడు టీ గ్లాసులో తెచ్చి 'ఏమిరా నీ గ్లాసు పట్టురా' అనగానే గుడిసెచూరులో చెక్కివున్న మాలవాళ్ళ గ్లాసు తీసి పట్టాడు. అందులో పోశాడు. ఇదంతా ప్రసాద్

చూస్తూనే వున్నాడు. తనవాళ్లు త్రాగిపెట్టిన గ్లాసు– దాన్ని కడిగారో లేదో. లోపలెం దరో టీ త్రాగుతున్నారు. బయట మాలవాని గ్లాసు. మాలవాని టీ.

గాంధీజీ సాధించిన స్వాతంత్ర్యములో ఇది హరిజనుని గతి.

కోపమొచ్చింది ప్రసాద్‌కు. అన్న చేతిలోని గ్లాసును విసిరికొట్టాడు. కాపును బయటకు లాగి "ఇట్లా మావాళ్ళకు బయట టీ పోస్తే చంపేస్తాను" అంటూ నాలుగు తన్నాడు.

అందరూ ఆశ్చర్యపోయారు

ఊరిలో సంచలనం చెలరేగింది

పెద్దలందరూ ఆలోచించి ప్రసాద్‌ను ఆరాత్రి జైలుకు పంపించారు.

మాలమాదిగలంతా కల్సి ఈనాటి మంత్రి సీతారామయ్య (ఆనాడు అధ్యక్షుడు) కాళ్ళు పట్టుకొని ప్రసాద్‌ను విడిపించుకున్నారు.

అగ్రవర్ణాలను ఒప్పించి కేసు పెట్టించకుండా ఆపు చేయించాడు సీతారామయ్య.

బయటకొచ్చిన ప్రసాద్‌తో "ఆ అయ్య లేకపోతే నువ్వు జైలులో ఉండేవాడివి గదరా! నీమీద కేసు నడిచేది" అంటే "అయ్యా నీకు తెలియదు. మనమీద ఆయనకు అభిమానముంటే– అట్లా గ్లాసు బయటపెట్టి మనకు టీ ఇస్తున్నందుకు వానిమీదే కేసు పెట్టించేవాడు" అన్నాడు ప్రసాద్.

ఇంత పెద్ద గందరగోళం జరిగినా–

తర్వాత

మార్పేమీ లేదు.

అదే గ్లాసు– అక్కడే–

గుడిసె ముందు కూర్చుని మళ్ళీ టీ త్రాగుతున్నారు.

## 4

ఆ తర్వాత కొన్ని రోజులకు ఒక మిట్ట మధ్యాహ్నం "ఈ ఊరిదొర నన్ను పొలములో చెరిచాడురో వానిపైకక్ష తీర్చుకోకపోతే నేనీరాత్రి చస్తానురో" మాల వాడంతా తిరుగుతూ అరిచింది మామిడికాయలాంటి యువతి. ఆమెకింకా పెళ్లికాలేదు.

ఆమె పేరు సీత.

ఆమె అంటున్నది నిజమే.

ఆమె పొలములో పనిచేస్తూ ఉండగా దొర వచ్చి దాని అందాన్ని చూసి, మురిసి, పట్టి. అది రక్కినా కొరికినా ఎదిరించినా అరిచినా ఆ మక్కజొన్న చేనులో జొన్న మువ్వలాంటి సీతను నలిపేశాడు.

ఆమె తర్వాత— అట్లాగే చినిగిన రవికెతో ఊడిపోయిన కొంగుతో 'వానిపై కక్ష తీర్చుకొమ్మంటూ' మాలవీధి అంతా తిరిగింది.

అనాడు ప్రసాద్ లేడు.

సీతకు తల్లితండ్రులు లేరు. అన్న ఉన్నాడు కాని ఊళ్ళో లేడు.

ఆమె ప్రేమించే—మేనబావ—బొంబాయిలో పనికోసం వెళ్లాడు.

కక్ష ఎవ్వరూ తీర్చుకోలేదు. ధైర్యం లేదు.

రచయిత వాడకొచ్చి హరిజన పెద్దమనుష్యులను కల్సి "కనీసం దొరను వెళ్లి అడుగుమన్నాడు."

ఎవ్వరూ ధైర్యం చేయలేదు.

ఆ రాత్రి—

సీత ఏమనుకుందో ఏమో?—

బావిలో పడి చనిపోయింది.

తెల్లవారి—

ప్రసాద్ వచ్చాడు. విని— కోపముతో తుఫానులో చెట్టు ఊగినట్లు ఊగిపోయాడు. తన తోటి హరిజనుల నందరిని తిట్టాడు. అసహ్యించుకున్నాడు. మీరు మనుష్యులు కాదన్నాడు. మీలో రక్తమాంసాలు లేవన్నాడు. వట్టి పిరికిపందలన్నాడు. "వాన్ని ఆ దొరను చంపుతాను ఆ ఇల్లుకు నిప్పుపెడుతానంటూ" బయలు దేరాడు.

ఇంట్లో దొర లేడు.

లేకుంటే చంపేవాడే

అందరూ అపారు.

లేకుంటే— ఇల్లుకు అగ్గి పెట్టేవాడే.

తెల్లవారి—

పట్నంలో హరిజన సంఘానికి ఉపాధ్యక్షులైన సీతారామయ్య ప్రసాదును, కొందరిని పిలిపించాడు. ఆయన పిలిపించటానికి కారణముంది. నిజంగానే ప్రసాద్ చంపుతాడనే భయంతో— దొర శంకర్‌రెడ్డి ఆయన కాళ్లు పట్టుకున్నాడు.

ప్రసాద్ ఒక మాటన్నాడు సీతారామయ్యతో

"ఇది నాకు అవమానం కాదు. మీకుమీకు— మీరు మాకు ప్రతినిధులు" నిజమేనంటూ తలూపాడు సీతారామయ్య.

ప్రసాద్ ఇంకోమాట అన్నాడు "ఒకనాడు వానింటికి అదే దొర యింటికి వెళితే "అరేయ్ మాలోడా! బయట ఉండురా ఎక్కడికిరా లోపలికి"— అన్నాడు. ఈనాడు వానికి సిగ్గులేదు ఒకదాన్ని చెరచటానికి. పండటానికి మాదిగది కావాలి, పనిచేయటానికి మాదిగది కావాలి, బావులు త్రవ్వటానికి మాదిగ కావాలి. పొలాలు దున్నటానికి మాదిగ కావాలి. కాని మాదిగవాడు అంటరానివాడు వానికి పరువులేదు. ప్రతిష్టలేదు. వాని శరీరం శరీరం కాదు. వాని ఆడవాళ్లు ఆడవాళ్ళు కారు. వేశ్యలు కదూ! వీడిట్లా ఎందరినో చేసాడు పరువు—ప్రతిష్ట—భయం నోరు నొక్కేసింది. ఇక ఈ దొర ఆటలు మేము సహించం."

ఏమీ అనలేదు సీతారామయ్య. చాలా సేపటి తర్వాత "ఏదో రాజీ చేసుకుందాం రా ప్రసాద్"

"ఏ రాజీ అవసరం లేదు"

సీతారామయ్య చెప్పిన ఏ రాజీకి అంగీకరించలేదు. ఒకమాట అన్నాడు ప్రసాద్ "మనకు అన్యాయం జరిగింది, మీరు వేరుకాదు మేము వేరుకాదు. మనమంతా ఒకటి రాజీ అంటూ మాట్లాడటం నాకు ఆశ్చర్యమేస్తుంది."

సీతారామయ్య ఏదో ఆలోచనలో పడ్డాడు. ఇదేదో తనమీద బిగేలా వుంది. ప్లేటు మార్చాడు. "నిజంగానే ప్రసాదు పోలీసు కేసు పెట్టుదాం."

అంతలో శంకర్‌రెడ్డి వచ్చాడు.

వాన్ని చంపాలనే వుంది ప్రసాద్‌కు— ఎదురుగా సీతారామయ్య.

ప్రసాద్‌తోపాటు ఇద్దరు పెద్దమనుషులు కూడా వచ్చారు. వారేమి మాట్లాడటం లేదు. ప్రసాద్ అనేదాంట్లో న్యాయముంది. పెద్దమనుషులకు కూడా దుఃఖముంది. కోపముంది. దానితోపాటు భయముంది.

శంకర్‌రెడ్డి ఒక మాటన్నాడు, "నాది తప్పే. మీరంతా క్షమించాలి" ప్రసాద్ తంతాడనే భయమే అనిపించింది.

"తప్పా.....క్షమాపణా.....నీ తల నరికితేనే శాంతి"— అన్నాడు ప్రసాద్.

"కొంచెం శాంతిరా ప్రసాద్" సీతారామయ్య ఊరడించాడు.

అందరికీ ఇంట్లో నుండి కాఫీలొచ్చాయి.

తాగిగారు.

బయట కొచ్చారు.

ప్రసాద్‌కు రెండు విషయాలు మనసులో కొచ్చాయి.

సీతారామయ్యది తన కులం. తనవాళ్లు తన ఊరునుండి వస్తే కింద కూచో బెట్టాడు ఆయన కుర్చీమీద కూర్చున్నాడు. అదే శంకర్ రెడ్డి వస్తే కుర్చీమీద కూర్చోబెట్టాడు.

తన ఊళ్ళో మాలవాడు అంటితే నీళ్ళువాడని ఈ శంకర్ రెడ్డి— సీతారామయ్య కాఫీ యిస్తే తాగిగాడు—

అప్పుడే తెల్సుకొన్నాడు ప్రసాద్. ఉన్నవాళ్ళంతా ఒకటి— లేనివాళ్ళంతా ఒకటి.

పోలీసుల ద్వారా కేసు పెట్టించాడు.

సాక్ష్యం—

సీత బజారులో అరిచినట్టు—

ఎందరో విన్నట్టు—

ఆమె ఆత్మహత్య చేసుకున్నట్టు—

హరిజనుల నందరినీ ఏకత్రాటికి కట్టేశాడు ప్రసాద్.

ప్రసాద్‌కు డబ్బులేదు పోదాగల వ్యక్తుల సహాయం లేదు.

శంకర్ రెడ్డికి డబ్బు — పరువు.

కేసు కొట్టేశారు.

ప్రసాదుకు కోర్టుల మీద నమ్మకం పోయింది. ఆయనకొక విషయం అర్థ మయిపోయింది. తనకు న్యాయం దొరకక పోవటానికి కోర్టు కారణం కాదు. డబ్బు కారణం.

## 5

రచయితనుఊరు ఆ నుండి ట్రాన్స్‌ఫర్ చేసారు. ఆయన ఆ గ్రామములో గవర్న మెంటు టీచర్.

శంకర్ రెడ్డి తనను ట్రాన్స్‌ఫర్ చేయించాడని రచయితకు అర్థమయిపోయింది.

తన గ్రామములో హరిజనులు చైతన్యవంతం కావటానికి రచయితే కారణమని—

రచయిత వెళ్తూ ప్రసాద్‌తో ఒకమాట అన్నాడు "నా అవసరం ఇక్కడ తీరిన తర్వాత ట్రాన్స్‌ఫర్ చేయించాడు. ఇంకో ఊళ్ళో నా అవసర ముంది. ఒక మాట

ప్రసాద్. మన వాళ్లంటే – లేనివాళ్ళు– ఎన్నో తప్పులు చేస్తారు. మన దారిలోకి తొందరగా రారు. విసుగొద్దు. వాళ్లకు కోపమొచ్చి – లేచిన నాడు వాళ్ళముందు నడుస్తారు. మనమే వెనుక అవుతాం. మొత్తంమీద ఈసమాజం సంస్కరణల్తో మారదు ఈవిషయమే వాళ్లకు నేర్పితే – పునాదుల నుండి మార్పులకు వాళ్లు ఉద్యమిస్తారు"

## 6

ఆ ఊళ్ళో అగ్రవర్ణాల మధ్య హరిజనుల మధ్య అపుడపుడు పేచీలు జరుగుతూనే ఉన్నాయి. హరిజనులకు అగ్రివర్ణాలకు మనస్పర్ధలు ఉంటూనే ఉన్నాయి.

## 7

మూడేళ్లు గడిచి పోయాయి. ఎన్నికలొచ్చాయి. పట్నంలో తన గ్రూపు వాళ్ళ ఒత్తిడి మూలంగా– సీతారామయ్యకు ఎం. ఎల్. ఏ.కు పార్టీ టిక్కెట్టు దొరికింది. ఒక 'రెడ్డి' ఆయనకు పోటీగా నిల్చున్నాడు.

సీతారామయ్యకు ప్రసాద్ బలంతెలుసు. ఆయనకు ఊళ్ళో కొందరు యువకులున్నారు. కాలేజీలో ఒక గ్రూపుంది. అందుకే ప్రసాద్‌ను పిల్చి తనదిక్కు ప్రచారం చేయుమన్నాడు.

ప్రసాద్ చాలా ఆలోచించి మాట్లాడాడు

"సీతారామన్నా. నేను చాలా విషయాలు ఆలోచిస్తున్నాను. నాకేదోనిజం అర్థం కావటంలేదు. మీరుగెల్చినా– లేనివాళ్ళకు పెద్దగా సహాయం చేస్తారనే ఆశ నాకులేదు. మీమీద విశ్వాసం లేకకాదు. చేయటానికి వీలులేని పరిస్థితులు ఇక్కడున్నాయి. లేని వాళ్ళపేరిట ఏమిచేసినా– ఉన్నవాళ్ళు దక్కించుకునే స్వరూపం ఇక్కడ ఉంది. ఇటువంటి పరిస్థితిలో– ఆత్మనమ్మకొని మీకు ప్రచారం చేయలేను. అయితే– మీరు గెలిస్తే కొంతలో కొంత మంచిదే, మేలు జరుగొచ్చు. అందుకే నావాళ్ళు– ఎవరైనా ప్రచారం చేస్తానంటే– వద్దనను''—

బయట కొచ్చేసాడు ప్రసాద్.

సీతారామయ్య గెలిచాడు. ఉన్నవాడు కాబట్టి కొంత ఖర్చుచేసాడు. పార్టీప్రతిష్ట కొంత– వెనుకబడిన వర్గమంతా– "మనవాడు"– అంటూ అనుకోవటం మూలంగా–

గెల్చిన తర్వాత ఆయనకో గ్రూపుందని. ఇంకొకటి హరిజనుడని—

"మంత్రి" పదవి దొరికింది.

## 8

సీతారామయ్య మంత్రి అయిన తర్వాత– ఊళ్ళో మీటింగ్‌చేసి "మనమంతా ఒకటే. మాలమాదిగలు వేరుకాదు. ఈ దేశములో అంతా ఒక్కటే– మాలమాదిగలను హీనంగా చూడటం నేరంగా పరిగణించటం జరుగుతుంది– ఈ హరిజనులు కూడా సర్దుకోవటం మంచిది''– అంటూ– ఈ స్పర్థలు మానుకోవాలంటూ నచ్చచెప్పాడు.

## 9

సీతారామయ్య మంత్రి అయిన తర్వాత లక్ష్మీపురంకు లైట్లువచ్చాయి. బస్సులు పెరిగాయి. స్కూల్లో రెండు తరగతులు పెరిగాయి. భూములులేని హరిజనులకు కొన్ని భూములు లభించాయి. భూముఉన్నవారికి అప్పులు దొరికాయి.

మొత్తంమీద కొంతపని జరిగింది.

పనిలోపని–

దొరలకు ధనవంతులకు కూడా కొన్ని ఫ్యాక్టరీలకు లైసెన్సులు దొరికాయి. వాళ్ళు పెరిగారు.

గెల్చిన రెండేళ్లకు – హరిజనవాడ నిర్మాణం కొరకు లక్ష్మీపురంకు లక్షరూపాయలు మంజూరు చేయించాడు సీతారామయ్య.

అది ఊరికి నాల్గుఫర్లాంగుల దూరం బయట...

ఇక్కడే వచ్చింది పేచి.

"ఊరిలో కట్టించాలి భయమెందుకూ? ఊరికి దూరంగా ఉండాలా?" అంటాడు ప్రసాద్.

ఈ విషయంలో ప్రసాద్ పేచీ లేవదీసాడు.

అంగీకరించలేదు సర్పంచు రెడ్డి

'ఏదో వట్టిగా ఇల్లు రాగా ఈ అల్లరెందుకూ?' అన్నారు మిగతా హరిజనులు.

ప్రసాద్ ఈ విషయంలో సీతారామయ్య వద్దకెళ్ళాడు.

ఆయన మంత్రి–

పట్టించుకోలేదు.

ఊరికి బయట నాల్గు ఫర్లాంగుల దూరములో హరిజనవాడ వెలిసింది.

## 10

ప్రసాద్‌కు లెటర్ రాసాడు రచయిత భాస్కర్‌బాబు.

ప్రసాద్!

హరిజనవాడ విషయంలో ఓడిపోయావు కదూ! ఇది నీవు చాలా దీర్ఘంగా ఆలోచించాల్సిన విషయం. ఏ కట్టుబాటు నుండి ఈ విషయములో హరిజనులంతా వెళ్ళిపోయారు. ఎందుకూ? స్వార్థం ఏదో తమకు లభిస్తుందనే ఆశ 'నాది' అంటూ ఒక ఇల్లు అవుతుందనే ఆశ ఈ 'నాది' అనే ఆశలోనే ఈ వ్యవస్థ పునాదులున్నాయి

—మీ భాస్కర్

ప్రసాద్‌లో ఎన్నో ఆలోచనలు రేపింది లెటర్.

## 11

ఊళ్ళో హరిజనవాడ నిర్మాణంతోపాటు—
ఊళ్ళో ఒక మంచినీటి బావి పెద్దది.
హరిజనవాడలో ఒక మంచినీటి బావి చిన్నది
వెలిసాయి—

## 12

ఈ బావులే తెచ్చాయి చిక్కు
ఎండకాలం

బాగా ఎండలు కొట్టాయి. అంతకు క్రితం సంవత్సరం వర్షాలు కూడా బాగా పడలేదు. అందుకే చెరువులుకూడా తొందరగా ఎండుకపోయాయి. చిన్న చిన్న బావులన్నీ ఎండుకపోయాయి.

హరిజన వాడలోని బావి ఎండుకపోయింది.
అందులో నీళ్లు లేవు
పొద్దున ఊరే నీళ్లు నాల్గు ఇళ్ళకే సరిపోతున్నాయి.
ఊళ్ళో పెద్ద మంచినీటి బావిలో పుష్కలంగా నీళ్లు—
ప్రసాద్ ఆలోచించాడు ఎందుకు తెచ్చుకోకూడదు?

ఆమాటే అన్నాడు. "మనమంతా ఒకటే అని చెప్పాడు కదా సీతారామయ్య, ఎందుకు తెచ్చుకోకూడదు నీళ్లులేక చద్దామా? అందరిదీ బావి"

అందరూ తలూపారు.
తెల్లవారే సరికి హరిజనులంతా ఊళ్లో బావి నుండి నీళ్లు తోడుకొని తెచ్చుకున్నారు.
"ఊళ్ళో బావిని మాదిగవాళ్ళు ముట్టుకొన్నారని"

"ఊళ్ళో బావిలో మాలవాళ్ల నీళ్లు చేదుకున్నారని"

"మన గతేమిటీ? వాళ్లు మనం ఒకటే బావిలో చేదుకుందామా?" అందరూ ఇదే ప్రశ్న అగ్రవర్ణాలే కాదు మిగతా సాలె, వడ్రంగి, సాకలి, మంగలి, కాపు అందరూ ఇదే మాట.

అయితే ఈ పేచీ పెరుగటానికి శంకర్‌రెడ్డి కారణం. కొందరేమో ఈ కాలములో ఏమిటీ? త్రాగితే త్రాగనీ అనుకొన్నారుకాని ప్రసాద్ పైన కక్ష తీర్చు కోవాలని, సర్పంచు శంకర్‌రెడ్డి కావాలని ప్రచారం చేయించాడు. అందరినీ రెచ్చ గొట్టించాడు.

సర్పంచు హరిజనవాడ పెద్దమనిషిని పిలిపించాడు. హరిజనవాడ పెద్దమనిషికి ఇంతకాలం దొర అంటే భయం కాని ఇప్పుడు భయం పోయింది. రుమాలు చుట్టుకొన్న నెత్తితో, తొడుక్కున్న నిండుచేతులులేని అంగితో, మోకాళ్ళవరకు పంచతో, నోట్లో చుట్టతో – సర్పంచు ముందు నిలుచున్నాడు

సర్పంచు కుర్చీమీద కూర్చున్నాడు.

"ఇవ్వాళ ముట్టారేదో ముట్టారు. అది మాలాంటివాళ్ళ బావి, మాదిగోళ్ళ బావి కాదు రేపు ముట్టితే అందులోనుండి చేదితే– అక్కడ తలలు ఎగురుతాయి"–

"మాకు నీళ్లు"–

"కొత్తబావిని త్రవ్వించుకోండ్రా? లేదా ఆబావిని ఇంకాలోతుగా త్రవ్వించండి".

'పైసలు దొర'–

"మనిషికిన్ని వేసుకోవాలిరా" మీసం మెలేస్తూ చెప్పాడు.

బయటకొచ్చిన హరిజన పెద్దమనిషి– ప్రసాద్‌తో జరిగిన సంగతంతా చెప్పాడు.

"తలలు ఎగురుతాయా చూద్దాం" అన్నాడు ప్రసాద్.

## 13

గ్రామంలో ఏదో అగ్ని అంటుకునేలా కన్పించసాగింది.

ప్రసాద్ తన తోటి యువకుల నందరినీ సిద్ధం కమ్మన్నాడు.

సర్పంచు కాపువాళ్ళను పిల్చి "ఇది అన్యాయంరా మన బావిని మాలవాళ్లు ముట్టు కుంటే మనం త్రాగుదామా? రేపు ఏదో ఒకటి తేల్చివేయాలి. ఆ ప్రసాద్ గాడికి కళ్ళు నెత్తికెక్కాయి. వానిపని చేస్తే తప్ప అందరూ దారికిరారు. లేకపోతే మనను ఈ

ఊళ్ళోనుండి వెళ్ళగొట్టి ఊరినే లాక్కుంటారు" సిగిరెట్టు ముట్టించాడు. పొగ పీల్చాడు వారిక పొగవేసాడు.

ప్రసాద్ ఆనాడు ఊరంతా తిరిగాడు. వెనుక బడిన వర్గాల వారికంతా చెప్పాడు. "మనమంతా ఒకటి- లేని వాళ్ళమంతా ఒకటి- అల్లరద్దు. మనలో మనకు అల్లరి చేయాలని చూస్తున్నాడు రెడ్డి"— అని చెప్పాడు.

# 14

తెల్లవారింది. ఊరు మధ్య బావి. బావిం దూరంగా గాంధీ విగ్రహం. అటు పక్క పచ్చని వేప చెట్టు

వేప చెట్టుమీద కాకులు అరుస్తున్నాయి.

నాల్గు గంటలకే వచ్చి కాపువాళ్ళు కర్రలతో కాపలా ఉన్నారు.

కర్రలతో బిందెలతో వచ్చాడు ప్రసాద్. ఆయనతోపాటు ఇంకో ఆరుగురు యువకులు

అప్పటికే తెల్లవారబోతుంది.

"బావిలో తాడు వేయద్దురా" హెచ్చరించాడు కాపుపెద్ద వీరారెడ్డి

"మాకు నీళ్ళు కావాలి వీరారెడ్డి"

బావిలో తాడు వేశాడు.

ప్రసాద్ నెత్తిమీద కర్రి దెబ్బ పడింది. బావిలోని తాడు బావిలోకే పోయింది. తిరిగాడు ప్రసాద్. కర్రతో వేసినవాన్ని వేసాడు.

సంఘర్షణ ప్రారంభం.

వాళ్ల వీళ్ల కర్రలతో కొట్టుకుంటున్నారు.

కొట్టుకుంటూ గాంధీ విగ్రహం వరకు వెళ్లారు.

కాపు వాళ్ల పదిమంది

హరిజనులు ఆరుగురు

అప్పటికే ఆరుగురికి దెబ్బలు బాగా తాకాయి. ఒకడు అప్పటికే పడిపోయాడు.

గాంధీ విగ్రహం ముందు మిగతా ఐదుగురు పడి పోయారు.

పడిపోయిన తర్వాత కూడా ఐదుగురిపై కర్రలు నాట్యం చేసాయి.

గాంధీ ముందు రక్తం.

సూర్య కిరణాల తాకిడికి రక్తం మెరుస్తూంది.

# 15

ఈ వార్త జిల్లా అంతా ప్రాకి పోయింది. అందరికీ తెల్సింది.

పోలీసులొచ్చారు.

కొందరిని అరెస్టు చేసి తీసుకెళ్ళారు.

పత్రికలో కెక్కింది.

మంత్రి గారికి తెల్సింది.

తన ఊళ్ళో ఈ కథ... తాను హరిజనుడు తన ఊళ్ళో హరిజనులను కొట్టారు.

తనకెంత అప్రతిష్ట.

తనకేమైనా పరువుంటుందా దేశములో?

"కేసు పెట్టవద్దు. నేను అందరికీ రాజీ కుదుర్చుతాను ఆదివారం వస్తున్నాను." కలెక్టర్‌కు, ఎస్. పి. కి ఫోన్‌లో చెప్పాడు .

ఆదివారం ఇంకా నాలుగు రోజులు

ఆలస్యంగా పోవాలి. కోపాలు చల్లారుతాయి.

ఇదీ పథకం

# 16

ఆదివారం

అందరూ మంత్రి కోసం ఎదిరి చూస్తున్నారు.

అప్పటికి ఆసుపత్రి నుండి విడుదలయి వచ్చారు ప్రసాద్ ఇతరులు.

మంత్రి నాల్గు గంటల కొచ్చాడు

పంచాయితీ బోర్డు చావడిముందు నిల్చుని అందరినీ పిల్చాడు.

అంతాజనం నిల్చున్నారు. పెద్దలంతా కూర్చున్నారు.

అందరూ చెప్పారు. సర్పంచు, కాపు పెద్ద, హరిజన పెద్ద, వాళ్ళ బాధ. జరిగిన కథ.........

అందరు చెప్పింది అల్లరి గూర్చి......

అయితే—

తర్వాత —

తలా ఒక మాట అనుకొన్నారు. మంత్రి మూగిగా ఊరుకున్నారు. మాటలు మాటలు పెరిగాయి. మళ్లీ కొట్టుకునేలా తయారయ్యారు.

ప్రసాద్ ఏమీ మాట్లడటం లేదు. ఆయనకు తెలుసు ఈ పంచాయితీ తనకేమీ ఒరుగబెట్టదని, ఈ మంత్రి మనవాడైనా వాళ్ళ చేతిలో కీలు బొమ్మని, దీనికి పరిష్కారం ఇదికాదని..... ఇంకా ప్రసాద్ కనుమానంగానే ఉంది. సంఘర్షణ సంఘర్షణతో ముగుస్తుందా?—

ఇంతగా వీళ్ళు మాటలతో అనుకుంటున్నా మినిష్టర్ ఒక్కమాట మాట్లాడలేదు. ఎంతగా మాటలతో అనుకున్నా కొట్టుకోరని మినిష్టరుకు తెలుసు. ఎందుకూ? పోలీసు తీపుంది.

నోరెత్తాడు మినిష్టర్,
"మీరంతా ఊరుకుంటారా"
అంతా నిశ్శబ్దమయ్యింది.

అయితే ప్రసాద్ ఒక మాటన్నాడు "ఈ ఊరంతా ఒక్కటి అస్పృశ్యత పరగణన నేరమనే ఒక చట్టముంది మీకు తెలుసు. చట్టకర్తలే మీరు నేను చెప్పాల్సిందేమీ లేదు. ఊరు అందరిది. బావి అందరిది. మీరు మినిష్టర్ కాగానే ఒకమాట అన్నారు. మనమంతా ఒకటని కులమత బేధాలు విస్మరించాలని ఈ స్పర్ధలు పనికి రావని చెప్పారు ...... మేము గత్యంతరం లేక నీళ్ళకోసం బావిని ముట్టాం. మేము కావాలని కొట్లాట సృష్టించ లేదు, ఇంకోమాట— పాతికేళ్ళ స్వాతంత్ర్యం తర్వాత, హరిజనుల ఈ స్థితికి ఎవరు కారణమో మీరు ఆలోచించాలి. హరిజనుల ప్రతినిధిగా పరిష్కారం చెప్పమని అడగటం లేదు. ప్రభుత్వ ప్రతినిధిగా చెప్పండి''—తూచి తూచి మాట్లాడాడు.

ప్రసాద్‌కు మంత్రిచెప్పే పరిష్కారం మీద నమ్మకం లేదు. అది పంచాయితి, తప్పని సరి కాబట్టి మాట్లాడాడు,

"నేనొక పరిష్కారం చెపుతాను. మీరంతా వినండి: అందరికీనచ్చే పరిష్కారం హరిజనుల వాడలో రెండు రోజులు లోపున ఒక బావి త్రవ్విస్తాను. ప్రభుత్వగ్రాంటుతో బాలా" అన్నాడు మంత్రి.

ప్రసాద్ లేచి నిలుచున్నాడు

"సీతారామయ్య గారూ! ఈ సంఘర్షణను ఈ విధంగా ఎందుకు పరిష్కరించారో, కొంతమందికి సంతోషం కలుగొచ్చు. కాని నేను అర్థం చేసుకున్నాను. అంతేకాదు. 'చట్టం' దృష్టిలోని నేరస్తులను అరెస్టు చేయించకుండా ఎందుకు 'రాజీ' అంటూ వచ్చారో నాకుతెల్సు. మీరు మా ఓట్లతో గెలిచారు, మా ప్రతినిధిగా మాట్లాడటంలేదు, ప్రభుత్వ ప్రతినిధిగా మాట్లాడుతున్నారు. ఈ ప్రభుత్వమెవరిదో నాకు తెల్సు. సంస్కరణల పేరుతో కులాల నెందుకు పెంచుతున్నారో మేం అర్థం చేసుకుంటున్నాం. క్రొత్త బావులు నాలుగు త్రవ్వించండి! మంచిదే. అయితే అందరూ అన్ని బావులతో నీళ్లు తోడాలి అందుకే నా కృషి. నాకుతెల్సు. సంస్కరణల ద్వారా ఈ సంఘర్షణ అంతం కాదని"— అంటూ లేచి వెళ్లిపోయాడు ప్రసాద్.

## "కథకాదిది..."

వి. ప్రకాశ్

"దండాలు బాంచను"

కళ్ళద్దాలు బల్లపై పెట్టి ఆ మనిషిని నిశితంగా పరిశీలించాడు ఇన్స్పెక్టర్...

"నా పేరు కనకమ్మ బాంచను"

"ఏమిటి సంగతి"

"నేను గాంధీ నగరంలో వుంటను బాంచను– గాంధిబొమ్మ దాటితే నాలుగో ఇల్లే మాది బాంచను– ఇండ్లు కిరాయకిచ్చి బతుకుతున్న– మాయింట్లో ఓ పోకిరి యెధవ చేరిండు బాంచను ఇల్లు ఖాళీ సెయ్యమంటే సేత్తలేడు. ఎట్లయినా అన్ని ఖాళీ సేయించుండ్రి బాంచను."

"కొబ్బరి బోండలాగున్నావు నీ మొగుడులేడా?" కనకమ్మపైనుండి దృష్టిని మరల్చకుండానే అడిగాడు ఇన్స్పెక్టర్.

"ఆడు బేరానికి పోయిండు బాంచను– నెలకోసారి వత్తడు."

కాసేపాగి,

"ఆ పోకిరీయెధవ నాతిరి బాగా తాగొచ్చి నన్ను బలవంతం సేసిండు బాంచను. నేను కేకలెయ్యంగనే ఆడిగదిలోకి పోయిండు. ఆడిని ఎంటనే ఖాళీ సేయించుండ్రి బాంచను. సచ్చి మీకడుపున పుడతా" దీనంగా చెప్పింది కనకమ్మ

"సరే వాడిసంగతి నేను చూస్త, నువ్వుపో"

"వాడు నాత్రి నన్నేమైనా సేత్తడు బాంచను. కాల్మొక్త మీరే రచ్చింవాలి" అంటూ బయటికి నడిచింది కనకమ్మ.

బయటికి వెళుతున్న కనకమ్మను గుమ్మంలోనే ఢీకొట్టాడు జేబుదొంగ కాసీం.

"సలామ్ సాబ్"

"కాసీంగా నిన్న మామూలు తీసుకురాలే ఒక్క కొవ్వెక్కిందా బంచత్".

"నిన్న ఒక్క జేబుకూడా దొరకలేదు సాబ్" వణుకుతూ అన్నాడు కాసీం.

"ఎవ్వనిదగ్గర బే! నీ అబద్దాలు... అరేయ్ 401 వీణ్ణి లోపలికి తోలి తొండలెక్కియ్య" ఓ కానిస్టేబుల్ వైపు చూస్తూ అన్నాడు ఇన్స్పెక్టర్.

"సాబ్, సాబ్ ఇయ్యాళ తప్పక తెస్తాను సాబ్— ఈసారికి మాఫ్ కరో సాబ్" బ్రతిమాలాడు కాసీం

"నిన్నటిది ఇయ్యాటిది కలిపితేవాలి బే! లేకపోతే తెల్లారేటప్పటికి మనిషిగా వుండవు— పో ముండాకొడుకా" కసిరాడు ఇన్స్పెక్టర్.

వంగివంగి సలామ్ చేసుకుంటు బయటికి నడిచాడు కాసీం—

"సాబ్— రంగిని పట్టుకొచ్చిన" అని రంగి జబ్బపట్టి ఇన్స్పెక్టర్ ముందుకు తోసిండు కానిస్టెబుల్.

రంగి గజగజా వణికిపోతుంది.

"ఏమే లంజముండా! దొరకననుకున్నావా? పదిరోజుల్నుండి మామూళ్ళు ఎగ్గొడుతున్నవు" అంటూ కుర్చీలోంచి లేచి లాఠీ అందుకున్నాడు ఇన్స్పెక్టర్.

కానిస్టేబుల్ బయటికిపోయి తలుపేసుకున్నాడు—

"నన్ను కొట్టకుండి బాంచను. నేనావని సేత్తలేను. కూలిసేసుక బతుకుతున్న— అయ్యో...నన్నుకొట్టకుండ్లి..." అంటూ లాఠీలదెబ్బలకు చేతులడ్డం పెడ్తుంది రంగి.

"నువ్వు పనిమానుకుంటే మేమంత ఎట్లబతుకాల్నే లంజా..." అంటూ క్రింద పడిన రంగిపొట్టలో ఈడ్చితన్నాడు ఇన్స్పెక్టర్,

"అమ్మా..." అంటూ బాధతో మెలికలు తిరిగింది రంగి.

కాసేపటికి శిక్ష యింకా పూర్తి కానట్లు గుడ్డలేకుండా అచేతనంగా పడివున్న రంగిని స్టేషన్ వెనక రూమ్‌లోనికి ఈడ్చుకుపోయినారు పోలీసులు.

పోలీసు స్టేషన్‌లో గడియారం పది గంటలు కొట్టింది.

కుర్చీలోనుంచి లేచి స్టేషన్ బయటికి నడిచాడు ఇన్స్పెక్టర్.

తుంపర తుంపరగా వర్షం పడుతుంది. కాసేపు ఆగి ఏదో నిశ్చయించుకున్న వాడిలాగా మోటారు సైకిల్ స్టార్టు చేసి రోడ్డుమీది ఉరికించాడు ఇన్స్పెక్టర్.

రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది, అక్కడక్కడ వీధిలైట్లు వెలుగుతున్నాయి.

"మహేంద్రా బార్" అన్న బోర్డు చూసి మోటార్ సైకిల్ ఆపాడు ఇన్స్పెక్టర్

'సలామ్‌సాబ్' లేచి సల్యూట్ చేశాడు గూర్ఖా

లోపల కాబరే జోరుగా సాగుతుంది. ఇన్స్పెక్టర్‌ను చూసి ఇంకా హుషారుగా స్టెప్స్ వేస్తుంది కాబరే డాన్సర్ రోజీ.

"రోజూ బార్‌కొస్తుంటే జనానికి కొత్తగా తనంటే భయంలేకుండా పోయింది" అని మనసులోనే తిట్టుకున్నాడు ఇన్స్పెక్టర్–

రోజీ విస్కీబాటిల్ తీసికొని ఇన్స్పెక్టర్ దగ్గర కొచ్చింది. విస్కీ బాటిల్ నోట్లో పెట్టుకుని రోజీ బ్రాసరీ హుక్స్ 'ఫట్' మనిపించాడు. చిత్తుగా తాగి పదకొండు గంటలకు మోటర్‌సైకిల్ ఎక్కాడు ఇన్స్పెక్టర్.

వర్షం ఎక్కువయింది, మోటర్ సైకిల్ గాంధీనగర్ వైపు పరుగుతీసింది.

కనకమ్మ ఇంటిముందు మోటార్‌సైకిల్ ఆపి తలుపులపై బాదాడు ఇన్స్పెక్టర్

"వస్తున్న- ఎవరూ" అంటూ తలుపు తీసి ఆశ్చర్యపోయింది కనకమ్మ. కనకమ్మను లోపలికి నెట్టి తలుపు గొళ్లెం పెట్టిండు ఇన్స్పెక్టర్–

"ఏంది బాంచను, గీయేల్లప్పుడు వానలో ఇటొచ్చిండ్లు– ఆ యెధవ భయానికి ఇంటికి రాలేదు–

కనకమ్మ చెప్పిందే వినిపించుకునే స్థితిలో లేదు ఇన్స్పెక్టర్.

తూలుతూ కనకమ్మను మంచము పైకి తోశాడు. అప్పటికిగాని కనకమ్మకు అర్థంకాలేదు ఎదిరించింది... ఓడిపోయింది. ఎక్కడో కోడికూత వినిపించి నిద్రలేచాడు ఇన్స్పెక్టరు. ఒళ్ళువిరుచుకుని ప్రక్కలోకి చూశాడు– కనకమ్మ అచేతనంగా పడివుంది. ఒంటిపై రక్తపు మరకలు అక్కడక్కడా మెరుస్తున్నాయి.

ఇన్స్పెక్టర్ బయటికొచ్చి మోటర్‌సైకిల్ స్టార్ట్‌చేశాడు– గాంధీ విగ్రహం దాటాడు– మోటర్‌సైకిల్‌ను పోలీస్‌స్టేషన్ వైపు త్రిప్పాడు.

స్టేషన్‌లోకి వచ్చిన ఇన్స్పెక్టర్‌ను చూసి కానిస్టేబుల్ పరుగెత్తుకుంటూ వచ్చాడు—

"సాబ్... రంగి... సచ్చిపోయింది" భయంగా ఒక్కొక్కమాటే అన్నాడు కానిస్టేబుల్–

ఇన్స్పెక్టర్‌కు బేజారెత్తింది. లోపలికివచ్చి కుర్చీలో కూర్చున్నాడు—

స్పృహతప్పి పడిపోయిన రంగిని రూమ్‌లోనికి పోలీసులు ఈడ్చుకెళ్ళినప్పుడే అడ్డుచెప్పాలనుకున్నాడు. కాని రంగి మామూలు ఇవ్వలేదనే కసితో ఏమీ అనలేక పోయాడు— గతమంతా మరొక్కసారి కళ్ళముందు తిరిగింది—

చాలా సేపు ఆలోచించాడు ఇన్స్పెక్టర్...

* * *

మరునాడు స్థానిక పత్రికల్లో తాటికాయంత అక్షరాల్లో చావుకబుర్లు చల్లగా పడినయ్—

"పోలీస్ స్టేషన్‌లోని బావిలో పడి రంగి అనే పాతికేళ్ళ పడుచు ఆత్మహత్య చేసుకుంది. అవినీతి నేరం క్రింద నిన్న రంగిని స్థానిక సబ్‌ఇన్స్పెక్టర్ అరెస్టు చేశాడు. చాటుగా వేశ్యావృత్తి చేస్తున్న రంగి తన విషయం నలుగురికి తెలుస్తుందనే భయంతో ఆత్మహత్య చేసుకున్నట్లు పోలీసులు భావిస్తున్నారు".

దానిక్రిందనే...

"గాంధీనగరంలో కనకమ్మ అనే 30 ఏండ్ల స్త్రీహత్య. హంతకుడు కనకమ్మ యింట్లో అద్దెకుంటున్న మొహినొద్దీన్ అనే యువకుడు— కనకమ్మను గత రెండు రోజులుగా అల్లరిపెడుతూ రాత్రి బాగా పొద్దుపొయ్యాక ఆమె యింట్లో చొరబడి కనకమ్మను మానభంగం చేసి చంపేసినట్లు స్థానిక సబ్‌ఇన్స్పెక్టర్ తెలిపాడు."

దానిపక్కనే...

కర్తవ్య నిర్వహణలో ఎంతో చాకచక్యంగా పనిచేస్తున్న స్థానిక సబ్‌ఇన్స్పెక్టర్... రావుకు రాష్ట్రపతి బంగారు పతకం రిపబ్లిక్‌డే రోజు బహూకరిస్తారు.

## ప్రపంచ చరిత్ర ఎందుకు చదవాలి?

"విప్లవ సిద్ధాంతం, చారిత్రిక పరిజ్ఞానం, కార్యాచరణలో పట్టులేకుండా ఏ రాజకీయపార్టీకూడా విప్లవోద్యమం నడపలేదు" మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను మనసుపెట్టి పఠించాల్సిన అవసరం ఎంతయినా వుంది. వాటిని పరిశీలించాలి. పరిశోధించాలి. అంతేకాదు పార్టీ సభ్యులందరూ దేశ, విదేశ చరిత్రలు తెలుసుకోవాలి. విప్లవ పార్టీ విజయాలు చారిత్రక అవగాహనమీదే ఆధారపడి వుంటాయి. ప్రపంచ విప్లవం గొప్పగా అభివృద్ధి చెందుతున్నదశలో, ప్రపంచ చరిత్ర పఠనం సామ్యవాద విప్లవానికి ఎంతో తోడ్పడుతుంది.

### ప్రపంచ పరిస్థితి లక్షణాలు

ఇవాళ మనం వుంటున్న యుగం "ప్రపంచ పరివ్యాప్తంగా సాంఘికవ్యవస్థ తీవ్రమైన మార్పులకు లోనవుతున్న సంచలనాత్మక యుగం." దేశాలు స్వాతంత్ర్యాన్ని జాతులు విముక్తిని, ప్రజలు విప్లవాన్ని కోరుతున్నారు- ఇది అపశక్యంకాని చారిత్రిక ప్రవాహం, రెండు అగ్రరాజ్యాలు ప్రపంచాన్ని అదుపుచేసే కాలం దాటిపోయింది. ఇలాంటి యుగంలో నివసిస్తున్న మనం పోరాటాలకు తయారుగా వుండాలి. ఈపోరాటాల రూపాలు గతంలో జరిగినవాటికి భిన్నమయినవి

మన విప్లవ కర్తవ్యాలు ప్రపంచ ప్రజల విప్లవ పోరాటాలతో ముడిపడి వున్నాయి. ప్రపంచాన్ని మనం హృదయానికి హత్తుకోవాలంటే ముందు దాన్ని మనం అర్థం చేసుకోవాలి. నేటి ప్రపంచం నిన్నటి ప్రపంచం నుంచి మొగ్గదొడిగిందే. వర్గ పీడనకు, విదేశీ దురాక్రమణకు, వలస పాలనకు వ్యతిరేకంగా చిరకాలం నుంచి ప్రపంచ ప్రజలు పోరాడుతున్నారు ఇవాళ సామ్రాజ్యవాదానికి, దాని తొత్తులకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలుకూడా వాటి కొనసాగింపే. ప్రపంచ చరిత్ర మనకు ఒందుకు తోడ్పడుతుంది. గతంలో దాని తీరుతెన్నులను తెలుసుకుని, అనుభవాలు నేర్చుకుంటే నేటి ప్రపంచపు ప్రత్యేక లక్షణాలు మరింతబాగా తెలుసుకోవచ్చు. అందువల్ల శ్రామిక విప్లవ విజయంపైన మన నమ్మకం బలపడుతుంది శ్రామికవర్గ అంతర్జాతీయ చైతన్యం పెరుగుతుంది. దేశదేశాల ప్రజలకు మధ్య తోడ్పాటు పెంపొందిది విప్లవ పోరాటాలు. తద్వారా ప్రపంచ విప్లవం ముందుకుపోతాయి.

'సకలలోక సంచలనం' అనేది నేటి ప్రపంచపు ప్రత్యేకలక్షణం ఈ సంచలనానికి వర్గస్వభావం వుంది. ప్రపంచంలోవున్న వైరుధ్యాలు మరింత తీవ్రమైనాయి. ఇది మంచా? చెడా? అంతర్జాతీయ పరిణామాలను ఎలా మదింపువేయాలి? పాత వ్యవస్థను కూలదోసి కొత్తవ్యవస్థను నెలకొల్పడం అనేది హృదయాలను కదలించే

వర్గపోరాటాల ద్వారానూ, పునాదుల పెకలించే పెనుమార్పుల ద్వారానూ మాత్రమే సాధ్యం. ప్రపంచ చరిత్ర చదివితే ఈసంగతులు మనకు తేటతెల్లం అవుతాయి. రోమన్ సామ్రాజ్యంలో బానిసల తిరుగుబాట్లు, అంతర్యుద్ధాలు చాలా ప్రాపాటి. వీటన్నిటి ఫలితంగానే బానిస విధానం నేలమట్టమయింది. దాదాపు రెండువందల ఏళ్ళపాటు యూరప్, అమెరికాల్లో జరిగిన బూర్జువా విప్లవాలే భూస్వామ్య విధానానికి గోరీకట్టాయి.

మార్క్సిజం పుట్టి నూరేళ్లు పైచిలుకయింది. ప్రపంచ రంగంమీదికి శ్రామిక వర్గం వచ్చింది. బూర్జువా విధానాన్ని, దోపిడీవర్గాలను కూలదోయడానికి విప్లవ పోరాట పరంపరలు ప్రపంచాన్నే కుదిపివేస్తున్నాయి. అందుకని సకలలోక సంచలనం అనేది ఈనాడు సర్వసాధారణ లక్షణం. చారిత్రిక పరిణామ సూత్రాలు యీమాటే చాటి చెబుతున్నాయి. విప్లవ శక్తులకు, విప్లవ ప్రతీఘాత శక్తులకు మధ్య జరుగుతున్న జీవన్మరణ పోరాట ప్రతిబింబమే నేటి ప్రపంచ సంచలనం. ఈ సంచలనం వల్లనే సామ్రాజ్యవాదుల పాతప్రపంచం కూలి పోతోంది. సరికొత్త సామ్యవాద జగత్తు పురోగమిస్తోంది.

## సామాజిక అభివృద్ధి సూత్రాల ఆకళింపు

"వర్గాలు పోరాడతాయి. కొన్ని వర్గాలు గెలుస్తాయి, మరికొన్ని రూపుమాసి పోతాయి. వేలాది ఏళ్ళుగించి ఇదే మానవజాతి చరిత్ర." ప్రపంచ చరిత్ర చదివితే మానవ సమాజ అభివృద్ధి సూత్రాలు, విశ్వవ్యాప్తంగా జరిగిన వర్గ పోరాటాల చరిత్ర గతి మనం ఆకళింపు చేసుకుంటాం. అలా తెలుసుకోవడం వల్ల ఇప్పటి వర్గ పోరాటాల్లో మన పాత్ర మరింత పెరుగుతుంది. ఇంటా బయటా కూడా పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం— వీటి అన్యాయాలతో అక్రమాలతో నిండివుంది ఆధునిక ప్రపంచ చరిత్ర. దోపిడీకి, దురాక్రమణకు, పీడనకు వ్యతిరేకంగా విప్లవ ప్రజానీకం వీరోచితంగా పోరాడుతున్నారు. సుదీర్ఘ పోరాట క్రమంలో పెట్టుబడిదారీ విధానం, వలసవిధానం, సామ్రాజ్యవాదం అనాటికానాడు క్షీణిస్తున్నాయి. బడుగు దేశాల ప్రజలు, వలస ప్రజానీకం, విప్లవ ప్రజానీకం మునుముందుకు సాగి పోతున్నారు. ఒకప్పుడు బాగా వెలిగిన ఏ వలససామ్రాజ్యాన్ని చూసినా— అది జారిస్టు రష్యా కానివ్వండి, ఫాసిస్టు జర్మనీ కానివ్వండి, క్షుంగికృశించిపోయిన ఆంగ్ల సామ్రాజ్యం కానివ్వండి— చారిత్రక అభివృద్ధి సూత్రం కళ్ళకు కట్టినట్లు తెలుస్తుంది. పెట్టుబడిదారీ విధానం ఓడిపోవడం, సామ్యవాదం గెలవడమనేది చారిత్రక అభివృద్ధి సూత్రం.

19వ శతాబ్దంలో తెల్లవాడు తన నౌకాబలంతో సముద్రాధినేత అయ్యాడు. వారి దర్పానికి తిరుగులేదు, ఎదురులేదు అదిరింపులతో, బెదిరింపులతో, పెత్తందారీ రాజకీయాలతో ఐదు ఖండాలకు వ్యాపించింది రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం. కాని పెట్టుబడిదారీ విధానంలో అంతర్గతంగా వున్న వైరుధ్యాలను పరిష్కరించలేకపోగా వాటిని మరింత పెంచింది. శ్రామిక సామ్యవాద విప్లవం, వలస ప్రజల విముక్తి ఉద్యమాలు, వీటి ధాటికి బ్రిటిష్ సామ్రాజ్యవాదం పతనమయింది. బ్రిటిష్‌సామ్రాజ్యవాదం పెరుగుదల, విరుగుదలకూడా ఆధునిక సామ్రాజ్యవాదం, సోషల్ సామ్రాజ్యవాదాలను అర్థంచేసుకోడానికి పనికివస్తాయి. ప్రపంచం అంతటా వ్యాపించి ఇవాళ రెండు అగ్రరాజ్యాలూ రెండు భూతాల్లా కనిపిస్తున్నాయి. కాని ఆ భూతాలు ప్రజా విప్లవం అనే అగ్నిపర్వతంమీద కూర్చున్నందున సంక్షోభంలో కూరుకుపోయాయి. బ్రిటిష్ సామ్రాజ్యంలాగానే అవికూడా అస్తమిస్తాయి.

విప్లవ శక్తులు ప్రపంచమంతటా వ్యాపించి, వృద్ధి చెందుతూంటే సామ్రాజ్యవాదం కూలిపోతుంది. ప్రజల విప్లవశక్తులు మొదట్లో అంతంత మాత్రంగానే వున్నా అవి అజేయమే. ఎందుకంటే అవి చారిత్రక అభివృద్ధికి ప్రాతినిధ్యం వహిస్తాయి. చిన్నవి పెద్దవిగానూ, బలహీనమైనవి బలవత్తరంగానూ రూపొందుతాయి. ఎన్ని ఒడిదొడుకు లెదురయినా అవి చివరికంటా పోరాడుతాయి. చిన్న దేశం పెద్ద దేశాన్ని, బడుగు దేశం అగ్రరాజ్యాన్ని ఓడించగలవనడానికి ఎన్నో తార్కాణాలున్నాయి. చైనా విప్లవం, అల్బేనియా విప్లవం, అమెరికా సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కొరియా ప్రజాయుద్ధం, జాతీయ విముక్తి కోసం జరిగిన లావోస్, కాంబోడియా, వియత్నాం యుద్ధాలు— గత చరిత్రలోకూడా ఈసత్యం ఎన్నోసార్లు నిరూపితమయింది. 1775-1783 అమెరికా స్వాతంత్ర్య యుద్ధం గురించి చూద్దాం. అప్పటికి ప్రపంచంలోని అత్యున్నతమైన పారిశ్రామిక దేశం అయిన ఇంగ్లాండు జనాభా 3 కోట్లు, 30 లక్షల జనాభా కలిగిన అమెరికాకు, ఇంగ్లండు 90 వేల సైనికపటాలాన్ని పంపింది. అమెరికా వాళ్ళదగ్గర నాటుతుపాకులు, చిన్నచిన్న గెరిల్లాదళాలు మాత్రమే వున్నాయి. మొదట్లో చాలారంగాల్లో అమెరికా ఓడిపోయింది. బ్రిటిష్‌వాళ్ళు చాలా ప్రాంతం ఆక్రమించారు. యూరప్‌లోని అభ్యుదయశక్తుల ప్రోత్సాహంతో అమెరికా ప్రజలను సమీకరించి గెరిల్లాయుద్ధం మొదలెట్టి న్యాయసమ్మతమైన తమ స్వాతంత్ర్య యుద్ధాన్ని చివరకంటా కొనసాగించారు. దీర్ఘకాలిక యుద్ధాలలో బ్రిటిష్‌వాళ్లు పరాజయం పొందారు. అమెరికా స్వాతంత్ర్యం పొందింది. ఇవాళ సామ్రాజ్యవాదానికీ, సోషల్ సామ్రాజ్య

వాదానికి వ్యతిరేకంగా పోరాటాలంటే సరైన విప్లవపంథా అవసరం "తెగించి పోరాడాలి. కష్టాలను లెక్కచేయకూడదు. మునుముందుకు సాగిపోవాలి. అప్పుడు ప్రపంచం అంతా ప్రజలదే. భూతాలన్నీ మట్టికొట్టుకుపోతాయి."

## అన్ని దేశాల ప్రజాపోరాటాల నుంచి పాఠాలు నేర్చుకోవడం

విప్లవ పోరాటాల్లో అన్నిదేశాల ప్రజలు ఒకరికొకరు తోడ్పడుతూ వచ్చారు. చైనా, ఇతర ఆసియా దేశాల ప్రజలు, ఆఫ్రికా లాటిన్ అమెరికా దేశాల ప్రజలు అందరూకూడా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఒకేరకంగా పోరాడారు. చరిత్ర చదివితే ఆసంగతి మనకు బాగాతెలుస్తుంది. మనం శ్రామిక అంతర్జాతీయ కర్తవ్యాన్ని నెరవేర్చి వలసదేశాల ప్రజల న్యాయమైన పోరాటాలకు తోడ్పడటం ద్వారా విప్లవ పంథానునసరించాలి.

నాగరికత పుట్టిపెరిగింది ఆసియా, ఆఫ్రికా దేశాల్లోనే ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికాదేశాలు తమతమ ప్రాచీన నాగరికతావైభవాల మూలంగా మానవజాతి అభివృద్ధికి ఎంతో దోహదంచేశాయి. 15వ శతాబ్దంలో పాశ్చాత్య రాజ్యాల దండ యాత్రలవల్ల ఈమూడు ఖండాల్లో చాలా ప్రాంతాలు వలసపాలనకు, బానిసత్వానికి, పచ్చిదోపిడీకి గురయ్యాయి. బానిస వ్యాపారం, ఇతర దోపిడీ విధానాలమూలంగా ప్రాచీన నాగరికతకు సౌందర్యానికి, సౌభాగ్యానికి నిలయమైన ఆఫ్రికా ఖండం 'చీకటి ఖండం'గా మారిపోయింది. నాలుగు శతాబ్దాలపాటు యథేచ్ఛగాసాగిన దోపిడీమూలంగా ఆఫ్రికా జనాభా 10 కోట్లు తరిగిపోయింది. ఆఫ్రికా నీగ్రోలను పాపకూపాల్లోకి విసిరి పారేసి. చైనానుంచి కూలీలను నౌకలమీద అమెరికాకు పట్టుకుపోయారు. ఆఫ్రికా నీగ్రోల్లాగా, అమెరికా పాటక జనంలాగా. చైనా ప్రజలుకూడా చాలా హీనంగా, దీనంగా బ్రతికి ఐమ చెమట, నెత్తురు ధారపోసారు. పీడన వున్నచోట ప్రతిఘటన వుండి తీరుతుంది. పాశ్చాత్య వలస పెత్తందార్లకు వ్యతిరేకంగా భుజం భుజంకలిపి పోరాడి నెత్తుటి నీరాజనాలతో నెచ్చెలులయ్యారు. చైనా తైపాంగ్ విప్లవాన్ని అణచి వేసిన తెల్లవాడు పచ్చి బందిపోటు, కటిక కసాయి. ఆఫ్రికా వెళితే వీడిని కొడాన్ ప్రజలు ఖతంచేసారు. ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికాదేశాల ప్రజలు సోదరులు. సహోదరులు, కాలులో కాలు, వేలులో వేలుగా కలిసిపోయారు. కష్టసుఖాలు పంచుకున్నారు. ఇప్పుడు వీళ్ళదే పైచేయి. దీన్నే మూడో ప్రపంచం అంటున్నాం.

పరస్పరం నేర్చుకోవడం అనేది నేటి చారిత్రకదశలో చాలా అవసరం. కోట్లాది పీడిత ప్రజలే చరిత్రను, సమాజాన్ని సంస్కృతిని ముందుకు నడిపారు మానవజాతి

హక్కుల సంస్కృతీ నిర్మాతలు, వారసులు, చరిత్ర అధినేతలు సామాన్యజనులే. చిన్న దేశమయినా, పెద్ద దేశమయినా ప్రజలు మానవజాతి అభివృద్ధికి దోహదంచేసారు. తప్పులు ఒప్పులు దొర్లినా ఒకరినుండి మరొకరు గుణపాఠాలు నేర్చుకున్నారు. ఇతర దేశాలతో స్నేహ సంబంధాలవల్ల ప్రజలు ఎన్నో అమూల్యమయిన విషయాలు నేర్చుకుంటారు. తద్వారా తమ దేశ సంస్కృతిని కూడా పెంపొందించుకో గలుగుతారు. శ్రామికవర్గం అన్నివిషయాల్లోకూడా మార్క్సిస్టు వైఖరినే అలవరచుకోవాలి. విదేశాలను గుడ్డిగా అనుకరించడం, బానిస మనస్తత్వం ఎంతమాత్రం పనికిరానివి. అదే విధంగా విదేశాలనుంచి మంచి విషయాలు నేర్చుకోడానికి నిరాకరించడంకూడా మూర్ఖత్వం. దురహంకారం అనిపించుకుంటుంది గతం వర్తమానానికి, విదేశీ సంగతులు స్వదేశాలకు ఉపకరించాలనేదే సరయిన అవగాహన.

## మార్క్సిస్టు సిద్ధాంత అధ్యయనం

ప్రపంచ చరిత్ర చదివితే మార్క్సిజం మనకు మరింతబాగా అర్థమవుతుంది. అందుకే అన్నాడు లెనిన్— "గొప్ప తాత్వికదృష్టి, ప్రపంచ చారిత్రక పరిజ్ఞానం వీటి మేళవింపే మార్క్సిజం. ప్రపంచ చరిత్ర పరిజ్ఞానం లేకపోతే మనకు మార్క్సిస్టు మహోపాధ్యాయుల సిద్ధాంతాలు, వర్గసంఘర్షణల పునాది, కాలమానపరిస్థితులు, విప్లవం ఇత్యాదులు అర్థంకావు. నిర్దిష్ట చారిత్రక పరిస్థితులను సత్యాలనుచూసి వాటిని లోతుగా పరిశీలించడం ద్వారానే మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలు రాయగలిగారు. 'ఫ్రాన్సులో అంతర్యుద్ధం' అన్న పుస్తకం మార్క్స్ అలా రాసిందే అందులో పారిస్ కమ్యూన్ నాటినుంచి శ్రామికవిప్లవం, శ్రామిక నియంతృత్వం మున్నగు చారిత్రక అనుభవాల గురించి, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సుసంపన్నం చేసాడు. అలాగే ఎంగెల్స్ పుస్తకం "కుటుంబం, ఆస్తి, ప్రభుత్వ పుట్టుపూర్వోత్తరాలు," ఆదిమ సమాజం తీరుతెన్నులు, మానవ సమాజపు అభివృద్ధి క్రమం అందులో ఎంగెల్స్ చాలాగొప్పగా చిత్రించాడు. ప్రపంచచరిత్ర చదివితేనే ఇవన్నీ మనకు మరింత బాగా బోధపడతాయి.

చైనా విప్లవంపైన మావో రచనలు అర్థంచేసుకోవాలన్నా మనకు ప్రపంచ చరిత్ర తెలియాలి. ఇంటా బయటా చారిత్రక పరిస్థితులు సాకల్యంగా అర్థంచేసుకున్నాకనే చైనా విప్లవం గురించి మావో రాయగలిగాడు "నిప్పురవ్వే దావానలం రగిలిస్తుంది" అన్న మావోరచన చాలా గొప్పది. చైనాలో వర్గపోరాటం, ప్రపంచంలోని వివిధ వైరుధ్యాలు వీటిని బాగాపరిశీలించి శాస్త్రీయ నిర్ణయాలకు రాగలిగాడు మావో,

చైనా విప్లవం తత్వం అని ఎంతో వస్తుకంగా చెప్పగలిగాడు మావో. లీషావ్‌చీ మొదలైన నిరాశావరులు 'ఎర్రజెండాను మనం నిలబెట్టగలం' అని గొణుగుతూ వుండే వాళ్ళు. మావో, వాళ్ళసిద్ధాంత అవగాహనలోని లోపాలను తూర్పారబట్టి, బాగా ఎండే శాడు. మావో అంచనా ప్రకారం "1927 లో చైనా అర్ధవలసదేశం. దాన్ని కబళించా లని సామ్రాజ్యవాద దేశాలు పోటీపడుతున్నాయి." ఈ సంగతులు అవకాశవాదులు గ్రహించలేకపోయారు. మావో రచన మనం లోతుగా అర్థం చేసుకోవాలంటే అనాటి ప్రపంచ పరిస్థితి, సామ్రాజ్యవాద దేశాలమధ్య పోటీ. చైనాపార్టీలో రెండు పంథాల మధ్య పోరాటం ఇవన్నీ అవగతం చేసుకోవాలి. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ అనుభ వాలను సంతరించుకుని వాటిని క్రోడీకరించి, మార్క్సిజం- లెనినిజాన్ని మరింత వృద్ధి చేశాడు మావో. మావో సిద్ధాంతం తెలుసుకోవాలంటే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమచరిత్ర చదవడం అవసరం.

చిరకాలంనుంచీ కూడా పేరుపడ్డ విద్రోహులు బెర్న్‌స్టీన్, కాట్స్కీ, ట్రాట్స్కీ క్రుశ్చేవ్, బ్రెజ్నేవ్, వాంగ్‌మింగ్, లీషావ్‌చీ మార్క్సిజం- లెనినిజాన్ని సవరించాలనే వంకతో, సామ్రాజ్యవాదుల కొమ్ముకాసి మార్క్సిస్టు- లెనినిస్టు గ్రంథాలకు వక్ర భాష్యాలుచెప్పి ఆ విప్లవ సిద్ధాంతాన్ని వీళ్లగార్చి బూర్జువాలకు అనుకూలంగా మలిచారు.

సరైన మార్క్సిస్టు పంథాకు, అవకాశవాద పంథాకు చైనా పార్టీలో జరిగిన ఆంతరంగిక పోరాటాన్ని మావో క్రోడీకరించి చెప్పాడు. "ప్రస్తుత పరిస్థితిని అశ్రద్ధ చేయడం. చరిత్ర అధ్యయనాన్ని అశ్రద్ధ చేయడం మార్క్సిజం లెనినిజాన్ని అమలు పర్చలేకపోవడమే." ప్రజలు అదుపుచేసుకుండా వదిలేస్తే కమ్యూనిస్టుపార్టీ స్వభావం పూర్తిగా మారిపోతుంది. పార్టీ సభ్యులు తమ చారిత్రక బాధ్యతను నిర్వహించలేరు. చెడు పంథాకు ప్రతినిధిగా చైనా కమ్యూనిస్టు పార్టీలో లీషావ్‌చీ మొదలైన వాళ్ళు తలె త్తారు. వాళ్ళను మనం దుయ్యబట్టాలి, పరిస్థితులను సవ్యంగా అర్థంచేసుకోవాలి, చరిత్ర చదివి మార్క్సిజం - లెనినిజంను అమలు పరచాలి. ఇంటా బయటా కూడా విప్లవ పోరాట వాస్తవాలను పరిశీలించాలంటే సిద్ధాంత అధ్యయనం చరిత్ర అధ్యయనం కూడా అవసరం.

## వర్గపోరాటాన్ని ఆకళింపు చేసుకోవడం

కొన్నివేల ఏళ్ళనాటి, ఎన్నో సంఘటనలతో నిండి, మరెన్నో చిక్కులతో కూడి వున్న ప్రపంచ చరిత్రను అధ్యయనం చేయడమంటే మాటలా? అందుకే లెనిన్

అన్నాడు— "మార్క్సిజం మనకు మార్గం చూపించింది. చరిత్ర చదివేప్పుడు మనం వర్గపోరాటమే కీలకమని గుర్తించక పోయేటట్టయితే, మనకు సరైన అవగాహన వుండదు. మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనా విధానాన్ని మనం మార్గదర్శకంగా ఒప్పుకుని వర్గపోరాటాన్ని గట్టిగా ఆకళింపుచేసుకుని చరిత్రలో అదే కీలకమైన అంకె అని గుర్తిస్తేనే చారిత్రిక అభివృద్ధి సూత్రాలు మనకు తేటతెల్లం అవుతాయి. ప్రపంచ చరిత్రను చదువుకోడానికి, నేర్చుకోడానికి మనకు బాగా ఉపకరించే ఆయుధాలు మార్క్సిస్టు మహోపాధ్యాయుల రచనలే. అందుకనే మనం వాటిని మనసుపెట్టి పఠించాలి.

వర్గపోరాటం కొనసాగించడానికి చరిత్ర చదవడం చాలా అవసరం. వర్గపోరాటాలలో మన అధ్యయనాన్ని మిళితంచేస్తేనే మన దృష్టి సవ్యంగావుంటుంది. అప్పుడే మనం కీలకం అయిన సంగతులను గ్రహించ గలుగుతాం. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో రచనలను, ప్రపంచ చరిత్రతో కలిపి చదవాలి. పోరాటాలతో ప్రపంచ చరిత్రను మిళితం చేయాలి. అప్పుడే మనం గమ్యం చేరగలం. సమకాలీన ప్రపంచ చరిత్ర, ప్రపంచ కమ్యూనిస్టు చరిత్ర ఒకదానికొకటి ముడిపడి వున్నాయి. మన అధ్యయనంలో మనం ఆ మాటే నొక్కి చెప్పాలి.

# శుద్ధ కవిత

క. వి.

నిర్గుణ నిరాకార బ్రహ్మ గురించి ఎంతైనా ఊహించవచ్చు. ఊహల సోపానాల మీదుగా పరమపదం చేరుకోవచ్చు మరేమైనా చెయ్యవచ్చుగాని, "శుద్ధకవిత"ను మాత్రం కళ్ళకు కట్టించుకోలేము. అది ఈ లోకంలో దొరికే వస్తువుకాదు— మృగతృష్ణ రూపంలో తప్ప. అందుకే దానికి అంత ఆకర్షణ.

కవి అనుభూతిని తప్ప మరిదేన్నీ తన వస్తువులా కడగంటనైనా చూడనికవిత 'శుద్ధకవిత' అని నిర్వచిస్తున్నారు. అయితే సదరు అనుభూతికూడా సర్వసంపూర్తిగా సదరు కవి తాలూకు వైయక్తిక అనుభూతికే పరిమితం కావలసివుంటుంది. ఇలాంటి అనుభూతికి పొలిమేర ఆ కవిగారి పీఠోలే— తనదేహం అక్షరాలా దుర్గంకాగా, బయటి గాలి ఏదీ దాని బురుజులగుండా దూరి లోనికిరాకుండా దిగ్బంధం చేసినట్టుగా, స్వీయానుభూతికి కావ్యరూపం యిస్తే, 'శుద్ధకవిత' సాక్షాత్కరించగలదు— అప్పుడు 'ధన్యోస్మి', 'ధన్యోస్మి' అనుకోవచ్చు మనం, పామరులం, లౌకులం, పాఠకులం.

'శుద్ధకవిత' అనేమాట వినగానే 'శుద్ధాంతకాంత' జ్ఞాపకం వస్తుంది— రాజాంతఃపురాలలో వధువులకూ, కన్యలకూ వేరువేరుగా అరలుండేవి— అందాల చెరలు గోడలలో నిలువెత్తున ఆవుకళ్ళలాంటి కన్నాలుండేవి— గవాక్షాలు. వాటిద్వారా జీవకాంతీ ప్రాణవాయువూ లోనికి రావడమంటే మాటలుకాదు. సూర్యుడుకూడా చూడనేరని ప్రాణులు కాబట్టి శుద్ధాంతకాంతలు "అసూర్యం పశ్యలు". అందుచేతనే ముట్టుకుంటే కసుగందిపోయేంత కోమలంగా తయారయ్యారు ఆ పూబోడులు. అంతఃపురమే తమ ప్రపంచకం సమస్తం. అది తమకు స్వేచ్ఛా లేక లలిత కారాగారవాస శిక్ష? అది లోకమా లేక భోగాల నరకమా? తాము పూర్ణేందుముఖులా లేక పాండురోగగ్రస్తులా?

'శుద్ధకవిత్వమూ' అంతే. ఇది అబద్ధంకావడం అటుంచి, ప్రమాదకరం కూడా.

అబద్ధం ఎలాగైందంటే, ఏ 'శుద్ధ' కవి తాలూకు వైయక్తిక అనుభూతి అయినా సర్వ సంపూర్తిగా వైయక్తికమే కాజాలదు. తప్పనిసరిగా అతగాని అనుభూతిలో తదితరులది కూడా మిశ్రితమై ఉంటుంది— "తనదైన అనుభూతి తనది" కావచ్చుగాక, "తనదే" కాబోదు అలాంటిదే అనేకులకు వుంటుంది. కవి అనుభూతికీ జన్మస్థానం లోకం. జీవితానుభవం ఉన్నది ఉన్నట్టుగానే కాగితం మీదికి ఎక్కకపోవచ్చు. కవి హృదయం 'వస్త్రగాయం' పట్టి జీవితానుభవం నుండి కావ్యానుభూతిని రాబట్టుకోవచ్చు. అయినా మూలపదార్థం పూర్తిగా అంతరించి సరికొత్త

పదార్థం ఉత్పత్తికాదు. ముడిసరుకు విగ్గుదేరుతుంది, అంతే ఇది కొందరికి 'ఆల్కెమీ' అనిపిస్తుందేమో కాని, అలాంటి 'క్షుద్రవిద్య' కాదు జీవితానుభవంలో నుంచి ఏర్పడిన వ్యక్తి అనుభూతి, జీవితవాస్తవాన్ని మళ్ళీలోకానికి ప్రదర్శిస్తుంది. అందుచేత, ఉభయాగ్రాలలోనూ— ప్రారంభ, పర్యవసానాలలో— వ్యక్తి అనుభూతి లోకాశ్రితమే

ఇటీవలికాలాన కవిత్వం రాజకీయాలవల్ల "కలుషితమై" పోయిందని రాశారు అజంతా (ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి "అనుభూతి గీతాలు"కు పీఠిక) రాజకీయాలంటేనే 'మైల' అనే తత్వం సాహిత్యశ్రోత్రియత్వమే 'అన్య' వస్తువేదీ కవిత్వాన్ని స్పృశించ గూడదనడం ఆయన మతంలాగుంది. అస్పృశ్యతా సిద్ధాంతాన్ని అమలు పెడితే, స్పృశించేవాడికీ, స్పృశింపబడేవాడికీ— ఉభయులకీ కష్టమే— అన్యవస్తుస్పర్శలేని సాహిత్యం లోకస్పృహనే వదిలి 'తన'కు తానే బందీయైపోతుంది కవి "శరీర పరీవృతుడు" మాత్రమేగాక, వ్యక్తిగా సమాజ పరీవృతుడు. నిర్జీవి అయితే తప్ప ఏవ్యక్తీ సర్వతంత్ర స్వతంత్రుడు కాలేడు

రాజకీయాల గోల గురించి సాహిత్యక్రతువులో బయల్దేరిన గోల ఇప్పటిదికాదు. ఒకరి రాజకీయం మరొకరికి చేదు విషం. కాగా, మరో విషయం వుంది: ఎంతో కొంత మోతాదువరకు రాజకీయం సాహిత్యవస్తువైతే ఫర్వాలేదు లెమ్మనడం. ఉదాహరణకు, కుందుర్తి (తరం తరం పీఠిక) ఉన్నారు. గజ్జల మల్లారెడ్డి (కడప జిల్లా అరసం సభలో ఉపన్యాసం, విశాలాంధ్ర డిసెంబర్ 1976) ఉన్నారు. రాజకీయాలలో అజంతా, కుందుర్తి గజ్జల ఒకరికంటె మరొకరు ఒక ఆకు ఎక్కువే చదివినవారు.

దిగంబర కవిత్వ అనంతర కాలాన "కవిత్వమూ, రాజకీయమూ పూర్తిగా కలిసి పోయాయి" —కుందుర్తి

కొంత వరకు కలిస్తే ఫర్వాలేదనా?

రాజకీయం సాహిత్య వస్తువు కావచ్చుగాని, "నినాదాల" స్థాయికి దిగజారి పోకూడదు. —గజ్జల

అరసం కవులకూ, "విశాలాంధ్ర" రచయితలకూ అవశ్యం చెయ్యవలసిన హెచ్చరిక కాబోలు? అయితే యిది కొత్తదేమీకాదు. ఇరవయ్యేళ్ళకిత్రితమే "రాజకీయ నినాదాల బొద్దు" కవిత్వాన్ని తెగనాడుతూ "నిరంజన" కవిత్వం కావాలి, అని ఒక కవిత్వ నినాదమిచ్చి ఉన్నారు సోమసుందర్.

అజంతా, కుందుర్తి, గజ్జల – ఈముగ్గురూ ఒక విషయంలో ఏకీభవిస్తున్నారు. రాజకీయమూ సాహిత్యమూ వేర్వేరు. దీనితో ఎవరికీ పేచీలేదు. అయితే అవి పరస్పర బాహ్యమైన ప్రమేయాలా? ఆ ఇంటిమీది కాకి ఈ యింటిమీద వాలవచ్చునా, కూడదా? సీమాతిక్రమణం నేరమా?

ఏ మానవ ప్రమేయమూ పూర్తిగా శుద్ధమూ, పూర్తిగా అశుద్ధమూకాదు. రాజకీయం అస్పృశ్యమూ కాదు. రాజకీయమంటే ప్రభువులూ వారి ఆశ్రితులూ అధికారం కోసం, ప్రాపకం కోసం వేసే ఎత్తులూ జిత్తులూ రాజకీయమే; ప్రజలు తమ జీవిత అభ్యున్నతి కోసం బంధ విముక్తి కోసం మానవీయతా సముపార్జన కోసం చేసే చారిత్రిక పోరాటమూ రాజకీయమే. ఈ రెండింటిలో ఏ రాజకీయాన్ని "దూరం దూరం", "వారం వారం" పోపొమ్మంటున్నారు "శుద్ధ" కవిత్వవాదులు? ఏరాజకీయమైనా సరే అంటారు అజంతా. తన రాజకీయాన్ని తప్ప తక్కినదాన్నంతా అంటారు గజ్జల అనకపోయినా, అనుకుంటారు. "భక్తి మీది వలపు, బ్రాహ్మ్యంబుతో పొత్తు" వదలనేరని త్రిశంకు స్థితి కుందుర్తిది.

నినాదాలే కవిత్వమౌతాయని ఎవరంటున్నారు? రాజకీయం వస్తువైన కవిత్వానికి కళాత్మకమైన విలువలు తక్కువైతే, ఆమేరకు కవిత్వానికేగాక దాని రాజకీయ వస్తువుకీ లోటే. అయితే ఈ విలువలు ఎవరికోసం ఎవరు నిర్ణయించేవి? ఇంతకూ ఏమిటివి అవి? కవి తనభావాన్ని పాఠకులకు హృదయంగమంచెయ్యాలనేది ఒక్కటే, పరమోన్నతమైన విలువ. అయితే ఆ పాఠకులు ఎవ్వరు? ఎలాంటివారు? 'సహృదయులు'గా ఉండాలి అని ఒక అలంకారిక షరతు. సహృదయులంటే, కవి మనస్సును అందుకొని సమాన స్పందనపొంది తాము కావ్యానుభూతిని– సహానుభూతి – అనుభవించగల వాళ్లు.

కవి అనుభూతి సర్వసంపూర్తిగా స్వకీయం కాగలిగితే, జీవితానుభవానికి పుట్టిన బిడ్డ కాకుంటే, పాఠకులకు సమానంగా సహానుభూతి కలగడం ఎలా సంభవం?

ప్రజాకోటిలో వేర్వేరు స్థాయిలకు చెందిన పాఠకులు తమతమ వ్యాపకాలలో ఒక ముఖ్యాంశమైన రాజకీయానికి సాహిత్యం ద్వారా ఎందుకు ప్రతిస్పందించరు?

కాబట్టి, అనుభూతి సిద్ధాంతాన్ని కొసకంటా లాగితే, రాజకీయం అస్పృశ్యం కాకపోవడం అటుంచి, అవశ్యం సాహిత్యవస్తువుగా ఆదరించదగిందని తేలుతుంది.

అయితే, అది కుట్రల, కుత్సితాల, కౌటిల్యాల, అధికార రాజకీయంగాక, విశాల ప్రజాసముదాయాల విముక్తికీ ఉన్నతికీ చెందిన ఉత్తమ రాజకీయమే.

రాజకీయాన్ని వస్తువుగా గ్రహించిన సాహిత్యం, తన పాఠకులను గుర్తించుకొని, కళాత్మకంగా రూపొందినప్పుడు, కళాత్మకంగా రూపొందితేనే, సాహిత్యంగానూ, రాజకీయంగా కూడాను, రాణిస్తుంది.

కళాత్మకతను నిర్ణయించేది సహానుభూతి పొందే పాఠకులేగాని, శుద్ధసాహిత్యవేత్తలో, శుద్ధసాహిత్య వాదులో కాదు–

రాజకీయాన్ని సాహిత్యజీవులు ముట్టుకోరాదనడం, ఇజాలనన్నిటినీ నిరాకరించడంలా, పార్టీయేతర ప్రజాస్వామ్యాన్ని సమర్థించడంలా, తానే ఒక రాజకీయమై కూర్చుని, ప్రస్తుత సమాజవ్యవస్థకు చాలా తెలివిగా ఉపయోగపడ్తుంది–

లోకమే సాహిత్యప్రమాణం, జీవితమే సాహిత్యపరసీమ.

---

# ఉప్పెన

## అన్నా - చెల్లెళ్ళ సంవాదం : డాన్సుపాట

వంగపండు ప్రసాదరావు

ముందుమాట —

ఇటీవల వుప్పెనా, వరదా, గాలివానా తెలుగు దేశాన్ని ముప్పేటగా ముంచి పెట్టాయి. వుప్పెనలో జననష్టం అంచనాలకు అందడంలేదు. వరదల్లో గతిలేని జనం బాధలు - కడుపు తరుక్కుపోయే కన్నీళ్ళ విషాదగాధలు.

గాలివానలో ప్రతిచెట్టూ విరిగింది। ప్రతి గుడిశే కూలింది। ప్రతిమనిషీ తడిసేడు। రైతునడ్డి పూర్తిగా విరిగి పోయింది. ప్రతివాడు వంగి వాలి- పోతున్నాడు. గాలివానలో గుటుక్కు మన్నవాళ్ళంతా గుడిశల్లో బతికేవాళ్ళే, మెరక ప్రదేశాల్లో ఇల్లుకు నోచుకోక, గోతుల్లో ఇల్లేసుకున్నవాళ్లే. మేడలు గాకపోయినా కనీసం గోడలైనా లేక, తడికెలు అడ్డం పెట్టుకున్నవాళ్ళే. గట్టి డాబాల బాబులు సుష్టుగానే వున్నారు. తాటాకు పాకలవాళ్ళే "పేటీ" అయ్యారు.

అందువల్ల

అది కేవలం ప్రకృతి వైపరీత్యమే కాదు అస్తవ్యస్త వ్యవస్థ వికృతికూడా. ఈ వికృతికి విరుగుడు విప్లవమే.

### పాట

చెల్లెలు:- ఉప్పెన సందాకు మనము ఓరన్నా
ఎల్లుమోరె తోడు రమ్మీ। ఓరన్నా ॥ఎల్లు॥

అన్న:- ఎంత ముప్పు ముంచుకొచ్చెనే- ఓలమ్మీ
వేలకొలది మంది కొచ్చెనే- ఓలమ్మీ ॥వేల॥

చెల్లెలు:- బందరు దరిలోన - బంగాళ ఖాతము
వురుములే, వురిమింది - వుప్పెత్తు పొంగింది
కారు మేఘాలతో - కాట్లాడి లెగిసింది
మెరుపు విప్పులు కక్కి ప్రళయమై రేగింది ॥ఉప్పెన॥

అన్న:- ఉప్పెనొస్తాదనీ - ముప్పు తెస్తాదనీ
ఒకరోజు ముందుగా - ఇప్పిచెప్పేరాట।
అప్పుడే మేల్కొని - అందర్ని రక్షిస్తె
దివిసీమ తాలూక - దిబ్బకాపోనాట ॥ఎంత॥

చెల్లెలు:- కిలకిలా దాన్యాలు – నవ్వేటి జిల్లా।
తెలుగు సీమకు – ముఖ్యమా కృష్ణ జిల్లా
గుండెకాయా వంటి – గుంటూరు జిల్లాను
కొండలా పొంగింది – గుటకేసి మింగింది ॥ఉప్పెన॥

అన్న:- ఏడాది పొడుగునా – తెలుగోళ్ళ కందరికి
నెల్లాలు లోపలా – నోటికందె పంట
నిలువెత్తు నీటిలో – మునిగి పోయిందాట
నింగి నేలా రెండు – ఏకమయ్యాయాట ॥ఎంత॥

చెల్లెలు:- ఆకాశ రాకాసి – అవలింతలతోను
మనుసులూ – పసువులూ లచ్చలే మరణించి
వరదలో – బురదలో పీనుగుల కుప్పలు
తెప్పలై వూళ్ళలో – తేలతున్నాయాట ॥ఉప్పెన॥

అన్న:- ఆదిలో అధికార్లు – లారీలు పంపుంటె
పంటలూ పోయినా – ప్రాణాలు దక్కేవి
పేదోల్లు సత్తేమి – ప్రాణాలు పోతేమి
వస్తారు ఓట్లకీ – తెస్తారు లారీలు ॥ఎంత॥

చెల్లెలు:- బందరూ, దివిసీమ, బాపట్ల, రేపల్లె
బిలబిలా నాయకులు – మంత్రులూ వచ్చేరు
పీనుగులు చూసేం – కన్నీరు కార్చేరు
చందాలు ఇవ్వమని – సలహాలు చెప్పేరు ॥ఉప్పెన॥

అన్న:- అందుకే కాబోలు – అన్ని పార్టీలోల్లు
రామ రామా అంటు – రాగాలు తీగారు
రాబోయె ఎన్నికలొ – పోజలు మెద్దాలని
సచ్చేటి వాళ్ళకూ – సందాల కొస్తుంద్రు ॥ఎంత॥

చెల్లెలు:- చందాలు దండేది – సచ్చినోళ్ళకు కాదు
గాలిదెబ్బలు తగిలి – కాలు, సేతూలిరిగి
ఏడ్చి– ఏడ్చే కళ్ళనీరు లేనోళ్ళకి
అందరము చందాలు – అందజయ్యాలన్న ॥ఉప్పెన॥

అన్న:- కుళ్లి కుళ్లీవున్న - పీనుగుల మధ్యన
ప్రాణాలు మిగిలున్న - ఆ పేదప్రజలకు
అంటు రోగాలేవి - అంటుకుండా మనము
మందులూ, మాకులూ - దండిగా ఇవ్వాలి ॥ఎంత॥

చెల్లెలు:- ఉప్పెనా చోటుకే - ఒక్కరాబందైన
ఎక్కడా దరిలోను - కనిపించలేదాట
లాభాలు పొందేటి - రాబందుగాళ్లు
అప్పుడే ధరలన్ని - పెంచుతున్నారాట ॥ఉప్పెన॥

అన్న:- తిండిగింజల ధరలు - ఆకాశమంటాయి
కిర్సనూనీ రేటు - మండిపోతున్నాది
నల్లవ్యాపారులు - రంగానికొచ్చేరు
సరుకుల్ని దాసేసి - తాళాలు పెట్టేరు ॥ఎంత॥

చెల్లెలు:- రామరామా అన్న - పార్టీల పెద్దలూ
ధరలు అదుపూజేసి - అమ్మించకాపోతె?
ఉప్పెనై ప్రజలంత - కుమ్మకొస్తారు
పప్పులూ, ధాన్యాలు - పంచిపెడతారు ॥ఉప్పెన॥

అన్న:- అందాక అందరము - ఎంతాదుకున్నా
సొంతవూళ్ళలొ వాళ్ళు - బతికి మిగలాలంటె
వుండడానికి ఇల్లు - తినడానికీ తిండి
పండడానికి పొలము - ప్రభుత కల్పించాల ॥ఎంత॥

చెల్లెలు:- ఆల్లబతుకులు మల్లి - గాలిపాలవకుండ,
ఉప్పెనొచ్చీ మల్లి - వూడ్చిపారేకుండ
కట్టుదిట్టముగాను - అడ్డుగోడలు గట్టి
యంత్రాలతో ఆపి - తిప్పకొడుతుండాల. ॥ఉప్పెన॥

(ఈ రచన తేది. 27-11-77 న రాసింది. ఈ డాన్సును విశాఖ జన నాట్య మండలి- విశాఖపట్నం గురజాడ కళామందిరంలో తేది. 4-12-77 న ప్రదర్శించింది. విప్లవ రచయితల సంఘం. రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ ఆధ్వర్యంలో తుఫానుబాధితుల సహాయార్థం జరిగిన బహిరంగసభలో ఈ ప్రదర్శనజరిగింది)

వి. బి. గద్దర్ పాటలు:

## కరువు పాట

ఒచ్చెరో
కరువొచ్చేరన్నా
కరువొచ్చి
కష్టమొచ్చెరన్నా ॥ఒచ్చె॥

తల్లికి పిల్లనకుంట
పిల్లకు తల్లనకుంట
గొడ్డుగోడు పిల్లజెల్ల
గోడుగోడు మనుకుంట
పేగులన్ని మాడిపోయి...
సచ్చిపోయె రోజొచ్చే... ॥ఒచ్చె॥

వానకాల మేట్లగల్సి
ఎండకాలమైపాయె
మొగులుదిక్కు జూస్తుంతే
బుగులుబుగులు గావట్టె
సొప్పదడుపు బడకపాయె...
సచ్చిబతికి నట్లాయె... ॥ఒచ్చె॥

ఇత్తుకు ముత్తిస్తమని
ఇత్తనాలు దీసుకొచ్చి
కొత్తచెరువు కొనపొలము
కోంగ్రతా తుకముబోస్తె
గేగులొచ్చి మొలకంతా...
మొదట్లకే ఎండిపాయె... ॥ఒచ్చె॥
బక్కెద్దుల గట్టుకోని
బంజరు యిరువాల దున్ని

ఒక్కకురం పావుగుంట
ఒట్లోడు సల్లుకుంటె
పెద్దపోరి పూసలమ్మి
మందు సంచిదెచ్చి సల్లె
తుకంబోతె మానాయె
ఒరిసేనుకె ఒట్టమొచ్చె
పొట్టకొచ్చి ఒరిసేను...
వాడిపోయి మాడిపాయె... ॥ఒచ్చె॥

ఆక్నాసీ గుడ్డంలో
అద్దెకురం జొన్నలేస్తె
నిగనిగమని జొన్న సేను
నిలువెత్తు పెరగవట్టె
తలజుట్టు లేసుకోని
తళతళమని మెరువవట్టె
రోస్లేసిన మక్కజొన్న
రోకలంత కంకివెట్టె
పాలిత్తుల సాలువోనె
పడకపాయె వానసినుకు
కలకల కలమన్న సేను
గలగలమని మాడిపాయె
గుడ్డం కండ్లాబడితె...
గుండెలవిసి పోబట్టే... ॥ఒచ్చె॥

కలిపెదంత కంది నేను
మానెదంత మినుప నేను
అడ్డెదంత అనప నేను
సోలెదంత పెనగ నేను
కుంచెదంత కుసుమ నేను
తవ్వెదంత మవ్వ నేను
నామ్‌నిషాన్ లేకుండా
నాశనమై పాడాయె
పంటలన్ని పోయినంక...
పానముండి ఫలమేమీ... ॥ఒచ్చె॥

ఈడ బతుకులెల్ల కుంటె
ఇందూర్లొ బతుకొచ్చు
అన్నం దొరకకపోతే
మన్ను దిని సావొచ్చు
పసుల మొకం జూస్తుంటే
పానమెల్లి పోవట్టె
కుడియెడమ బజాల్లోల
నాగలెడ్లు రెండుండే
కట్టిన ఆవొకటుండే
ఈనె బర్రె ఇంకొకటి
పిల్లికూన కోడిపిల్ల
రామ జిలక పావురాలు
చేతులార గద్దలకు...
అప్పజెప్పె దినమొచ్చే... ॥ఒచ్చె॥

పస్సురాళ్ళు నమ్మినోడు
ఉప్పురాళ్ళు నమ్మడాయె
అప్పిచ్చిన సావుకారి
ఆలిపుస్తె అడగవట్టె
ఐకాయోడు బాకిలోడు...
బంజరుపై కన్నేసిరి... ॥ఒచ్చె॥

మోతుబరి ఆసాములు
మునిగింది ఏమిలేదు
ఎటు పెట్టి కూలి బతుకె...
ఎటమటమై పోవట్టే... ॥ఒచ్చె॥

కరువొచ్చిన రాకున్నా
దొరలకింత పికరు లేదు
ఊరునంత మింగినోడు
ఉయ్యాల లూగుతుండు.
అప్పులు సప్పులిచ్చి
అరిగోస బెడుతుంద్రు
గరిసెలన్ని నింపుకోని
గద్దకెక్కి కూకుంద్రు
కాగులన్ని నింపుకోని
కాల్లుజాపి కూకుండ్రి
కూలోల్ల కాపురాలు...
ఒంగాలని మురుస్తుంద్రు... ॥ఒచ్చె॥

దోచుకునే దొంగలంత
దాచుకున్నంత వరకు
దొంగలను కాపాడే
రాజ్యమున్నంత వరకు
కరువొచ్చిన కాలమైన
కూలినాలి బతుకింతె
రైతుకూలి లేకమయ్యి...
దణ్ జేసి తీరాలి... ॥ఒచ్చె॥

# లాల్ సలామ్!

లాల్‌సలామ్ లాల్‌సలామ్
లాల్‌సలామ్ సలామ్

...... ...... ............

లాల్‌సలామ్ లాల్‌సలామ్
లాల్‌సలామ్ సలామ్ ॥లాల్॥

భూమికొరకు భుక్తికొరకు
మనదేశ విముక్తికొరకు ॥మన॥
సాగే ప్రతిపోరులోన
సాహసులై పోరాడిన ॥సాహ॥
విద్యార్థి వెలుగులార
వీరులార శూరులార ॥వీరు॥
కోట్లాది శ్రమజీవుల...
లాల్‌సలామ్ లాల్‌సలామ్...
॥లాల్॥

హింసించే దుష్టులను
ధ్వంసించగ పిడికిలెత్తి ॥ధ్వంసిం॥
దోపిడి గుండెలలోన
బాంబులయి పేలినట్టి ॥బాంబు॥
ప్రజాయుద్ధ పంథాకు
ప్రాణమై వెలిగినట్టి ॥ప్రాణ॥
కామ్రేడ్ రాజారాం
అందుకో లాల్‌సలామ్ ॥అందు॥
భుజంగమా బాలక్రిష్ణ
అందుకో లాల్‌సలామ్ ॥అందు॥
కిశోరమా దుశ్యంతు
అందుకో లాల్‌సలామ్ ॥అందు॥
॥లాల్॥

గుండాలను గడగడగడ
వణికించిన మహాఘనుడ ॥వణి॥
క్యాంపస్ అన్యాయాలను
అంటించిన అగ్నికణం ॥అంటిం॥
సమసమాజ వెలుగులోన
సాగిన ఓ బాటసారి ॥సాగి॥
వెయ్యి కత్తి వేట్లకైన
చలించని వీరుడా ॥చలిం॥
అమరవీర జార్జ్‌రెడ్డి...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

తెలంగాణ వీరనారి
తెలంగాణ పోరునందు
వీరనారివలె నీవు ॥వీర॥
పంచాది నిర్మలవలె
నీ ఊరే ప్రజాపోరు ॥నీ ఊరే॥
నీరక్తం తరంగాల
ఊపిరులే ఉద్యమాలు ॥ఊపి॥
త్యాగాల బాటబోసి
ధన్యతనొందిన చెల్లి ॥ధన్య॥
చెల్లీ ఓ స్నేహలతా...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

చదువంటే ఉద్యమమని
ఉద్యమమే జీవితమని ॥ఉద్య॥
ఉన్నత విద్యను వదలి
ఉన్నత శిఖరాల కెదిగి ॥ఉన్న॥
దోపిడిపై దండెత్తి
విప్లవాల బాటనడిచి ॥విప్ల॥

బాటకొరకు నిండుబ్రతుకు
బలిచేసిన అమరవీర ॥బలి॥
విద్యార్థి చరితలోన
సదావెలుగు ఎర్రజ్యోతి ॥సదా॥
అమరవీర జనార్ధనా...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

నూనూగు మీసమందె
నిజం తెలుసుకున్నవాడ ॥నిజం॥
నిజం తెలిసి పోరన్నల
భుజంకలిపి నడిచినోడ ॥భుజం॥
కాకివలే వెయ్యేళ్ళు
విలువలేని బ్రతుకుకన్న ॥విలువ॥
ప్రజలకొరకు పోరులోన
వొరిగినట్టి విలువమిన్న ॥వొరి॥
వేలాది యువకులలో
నవరక్తం ఉరికించిన ॥నవ॥
ఎర్రపూల వనంకొరకు
నెత్తుటిలే చిందించిన ॥నెత్తు॥
మురళీ మోహనరెడ్డి...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

విద్యార్థి యువకులలో
ఉద్యమాల ఊపిరిలో ॥ఉద్య॥
ఊపిరిలో ప్రాణంలో
విప్లవాల గానంలో ॥విప్ల॥
అడుగడుగున పోరాటం
విప్లవాల ఆరాటం ॥విప్ల॥
అందుకున్నవా శిఖరం
దానిపేరె నీత్యాగం ॥దాని॥

అమరవీర సుధాకరా...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

చాకులాంటి కుర్రవాడ
చాల చిన్నపిల్లవాడ ॥చాల॥
పెద్దలనే మించినోడ
పేదలతో నిలిచినోడ ॥పేద॥
ఉగ్గుపాలతోనె పోరు
ఎర్రజెండ లెగరేసిన ॥ఉగ్గు॥
ఎర్రజెండ కాంతులీన
నింగిలోకి ఎగబ్రాకిన ॥నింగి॥
అమరవీర ఆనంద్రావు...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

తిరుపతిలో విద్యనేర్చి
తూర్పు విప్లవాలనేర్చి ॥తూర్పు॥
చదువులకు స్వస్తిచెప్పి
ప్రజా సమరమందు దూకి ॥ప్రజా॥
రేణుకుంట కొండల్లో
లావాలా రగిలిరగిలి ॥లావా॥
చిరునవ్వుతో ప్రజలకొరకు
ప్రాణాలను బలిచేసిన ॥ప్రాణా॥
రాళ్ళసీమ రత్నమా...
నాగరాజ లాల్‌సలామ్... ॥లాల్॥

ఉస్మాన్యా ఇంజెనీరింగ్
కళాశాల విద్యార్థి ॥కళా॥
విద్యార్థి ఉద్యమాల
ఆరిపోని వెలుగుజ్యోతి ॥ఆరి॥

విద్యార్థి నాయకుడా
ప్రజాపోరు వారసుడా ॥ప్రజా॥
తుపాకులను గెలిచేసి
గర్జించిన వీరుడా ॥గర్జిం॥
జంపాలా ప్రసాదిగో...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

నీరక్తం నీత్యాగం
కాదుకాదురా వ్యర్థం ॥కాదు॥
నీశక్తి నీయుక్తి
విద్యార్థుల నవశక్తి ॥విద్యా॥
నీమార్గం జనమార్గం
యువకుల కది ఆదర్శం ॥యువ॥
భూస్వామ్య వర్గాలకు
నీచూపే పిడిబాకు ॥నీచూపే॥

అమరవీర శ్రీహరీ...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

న్యాయశాస్త్ర విద్యను
మధ్యలోనె వదిలేసి ॥మధ్య॥
జనుల మంచి ఏరికోరి
కష్టాలను కోరుకొని ॥కష్టా॥
చిత్రహింస లెన్నిటినో
నిబ్బరంగ ఎదుర్కొని ॥నిబ్బ॥
నమ్మిన సిద్ధాంతానికి
నిండుప్రాణ మిచ్చినట్టి ॥నిండు॥
అమరుడ నార్సింహారెడ్డి...
అందుకో లాల్‌సలామ్... ॥లాల్॥

## కిం కర్తవ్యం ?

పంపిణీలు జరిగేంత వరకు
భద్రంగా వుండడంలేదు సరుకు
బియ్యం పప్పులూ వుప్పులు
భీమా చేస్తున్నయ్ పందికొక్కులు కొన్ని
తుపాను రక్కసి చప్పరించి వదిల్నా జనాన్ని
దోపిడీల ఈ కుక్కలు వదలవు
ఏక సభ్య ద్విసభ్య కమీషన్లను వేసి
ఏడేళ్లకు కనుక్కోవచ్చులే అక్రమాల్ని
ఈలోగా ప్రజల ప్రాణాలు
ఎగిరి కలిసిపోతాయే పంచభూతాల్లో
కిం కర్తవ్యం ?

— [illegible]దేవి

# చిత్రకళారంగం – మన చిత్రకారుల కర్తవ్యం

వర్గీస్

దేశంలో ప్రజాస్వామికోద్యమం బలపడుతున్నకొద్దీ ఆ ప్రభావం దేశంలోని సారస్వతం కళలపైన తప్పనిసరిగా వుంటుంది. అందుమూలంగా సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేకభావాలు ప్రబలడం మూలంగా నూతన సంస్కృతి నెల కొంటుంది. అదే నూతన ప్రజాస్వామిక సంస్కృతి. అది ప్రజాస్వామికోద్యమాన్ని ప్రతిబింబిస్తూ చరిత్రను ముందుకు తీసుకుపోయేదిగా, ప్రజల జీవితం ఆరాటపోరాటాల్ని చిత్రిస్తూనే వారిని పురోగమింప చేసేదిగా అంటే ప్రజల ప్రయోజనాలకు అనుగుణ్యంగా వుంటి, ప్రజా ఉద్యమంలో భాగమై ప్రజాస్వామికోద్యమాన్ని ముందుకు తోస్తుంది.

ప్రజా పోరాటాల ప్రభావంతో ఉత్తేజితమై, కళకళకోసమేనన్న సిద్ధాంతాన్ని బద్దలుకొడుతూ, కళ ప్రజలకోసమేననే భావం, శ్రామిక ప్రజల గాధలు బాధలు మాత్రమేకాక ప్రగతికొరకు వారు జరిపే పోరాటాల వూపిరినికూడా ప్రతిబింబించాలనే అభిప్రాయం ఆంధ్రప్రదేశ్ కళాకారుల్లో కూడా ప్రభవించింది. వారి కళకు వస్తువేమిటో వారికి స్పష్టంగా అర్థమయింది.

సాహితీరంగంలోనైతే ఇది బలమైన పునాదులు ఏర్పరుచుకున్నది. ఈరంగంలో ఆంధ్రరాష్ట్రం మిగతా రాష్ట్రాలకు మార్గదర్శకంగా కూడా వున్నది. అలా చూసి నప్పుడు నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల ప్రభావం లలిత కళలపైకూడా కొంత పడ్డ దన్నది వాస్తవం. ఐతే సాహితీరంగంతో పోలిస్తే ఇదిచాలా తక్కువ. ఐనా టీవి పాత్ర గణనీయమే.

పై పోరాటాల ప్రభావంతో వచ్చిన చిత్రాల్లు మనోమోహన్‌దత్ చిత్రించిన– డబుల్ బేరల్‌గన్, పి. ఎల్ 480, గౌలిగూడాచమన్, చంద్ర చిత్రించిన 'సమకాలీన సాహితీ ప్రతిబింబాలు' యివి ముఖ్యయికిపైగా వున్నాయి. నరసింగరావు చిత్రించిన రెడ్‌మెన్, ఎజిటేషన్, మార్చ్, ఇండియా, కామన్ మెన్ మొదలైన 15 చిత్రాలు. వీటిలో చంద్ర చిత్రాలు ఎక్కువ విప్లవ ప్రచారం చేయగలిగాయి. మిగతా ఇద్దరు చిత్రకారుల చిత్రాలు ఆబ్‌స్ట్రాక్ట్ పద్ధతిలో ఉన్నమూలంగా, అవి కళాత్మకంగా ఉన్న ప్పటికీ వాటిలోని సందేశం ప్రజలకు సులభంగా బోధపడలేదు. ఈచిత్రాల విషయంలో కళాకారుల్లో వాదోపవాదాలుకూడా జరుగుతున్నాయి. ఆ సమస్య ప్రజాదరణకు సంబం ధించింది. అది చెప్పడంలో ఎట్టి సందేహంలేదు ఉండకూడదు.

పై చిత్రాలను పరిశీలించినపుడు మనకు రెండురకాల చిత్రాలు కనిపిస్తాయి. 1. చంద్ర - సమకాలీన సాహితీ ప్రతిబింబాలు 2 మన్మోహన్ దత్, వరసింగ రావుల అబ్‌స్ట్రాక్ట్ చిత్రాలు వీటిలో ప్రజాదరణకు, కళాత్మకతకు సంబంధించిన లోపాలు వున్నమాట కూడా వాస్తవమే. కానీ అవి ఒక నూతనభావాన్ని [illegible]ళావాన్ని ప్రగతిని వ్యక్తపర్చాయి. కాబట్టి అవి చారిత్రకమైనవి.

ఇంతవరకు వెలువడ్డ పై చిత్రాలనుండి మన చిత్రకారులు తీసుకోవలసిన గుణపాఠాలు ఏమిటి? మొదటిది: కార్మికులు, కర్షకులు, విప్లవ సైనికులు, నగరపేద బూర్జువాలకొరకు చిత్రించడం. అంటే పైన పేర్కొన్న విప్లవ పురోగాములకొరకు మాత్రమే చిత్రించడం. రెండవది: మరింత కళాత్మకంగానూ, ప్రజాదరణ పొందేట్టుగానూ వుండేట్టు చూడడం. మూడవది: విశేషప్రచార దృక్పథం.

మొదటిది: మన ప్రజలు ముఖ్యంగా విప్లవానికి అత్యవసరంగా సమీకరించవలసిన గ్రామీణ రైతాంగం నూటికి 90 శాతం నిరక్షరాస్యులే. వారిని కదల్చాలంటే వారికి అర్థమయేలా చిత్రించి, వారిని ఉత్తేజపర్చాలి. సాహిత్యం మాదిరి చిత్రకళ కూడా వారికి అందుబాటులో వుండాలి.

రెండవది: కళాత్మకంగానూ, విప్లవ రాజకీయాలతో వున్న చిత్రకళ సృష్టించాలి. అంటే 'మిక్కిలి కళాత్మకంగా గుండెకు హత్తుకునేట్టు చిత్రించే పద్ధతికి, సరైన విప్లవ రాజకీయాలకు మధ్య ఐక్యత సాధించడం ద్వారా ఉత్తమ చిత్రాలు రూపొందుతాయి. చాలా కళాత్మకంగావుండి ఉన్నత విప్లవ రాజకీయాలతో కూడివుండి ఉత్తమ చిత్రంగా నిర్ణయించడానికి దేనిపై ఆధారపడి నిర్ణయమవుతుంది— అది కేవలం ప్రజాదరణ అన్నదానిపై ఆధారపడి మాత్రమే నిర్ణయమవుతుంది'— ఇదే ఛైర్మన్ మావో నొక్కి చెపుతాడు.

మూడు: పై రెండు విధానాలను అవలంబిస్తూ విస్తృత ప్రచార దృక్పథాన్ని కోల్పోరాదు. అది నేటి విప్లవావసరం, నేడు దేశంలో కొనసాగుతున్న వ్యవసాయిక విప్లవం జయప్రదం కావడానికి మిగతా సాహితీ, కళాకారులతోపాటు చిత్రకారులు ఈ విస్తృత ప్రచార దృక్పథాన్ని దృష్టిలో వుంచుకోవాలి. దానిని ఎట్టిపరిస్థితిలోనూ చిన్నచూపు చూడకూడదు.

ఇందుకు మన చిత్రకారులు అవలంబించవలసిన మార్గం ఏమిటి? సాహితీ కళా రంగాలలో పనిచేస్తున్న అందరి కామ్రేడ్స్‌లాగే చిత్రకారులుకూడా 'ప్రజలనుండి నేర్చుకోవడం. తిరిగి వారికి నేర్పడం' అన్నపద్ధతే అనుసరించవలసి వుంటుంది. అది వారు అనుసరించాల్సిన ఏకైకమార్గం కూడా.

విప్లవంలో అగ్రశ్రేణిలో నిలిచి పోరాడే కార్మికులు, విప్లవ సైనికులు, పట్టణ మధ్యతరగతి ప్రజలు— మొదలగు వారిని అధ్యయనం చేయాలి. అంటే వీరి జీవిత విధానాల గురించి, పోరాట చైతన్యం గురించి భవిష్యత్ దృక్పథం గురించి సంక్షిప్తమైన, సమగ్రమైన చిత్రణ మన విప్లవచిత్రాలు ప్రతిబింబించాలి. అంటే అవి మన చిత్రకారుల మెదడుపై ప్రతిబింబించాలి అదెలా సాధ్యం? ప్రజలలోకి పోవడంద్వారా వారి ఆరాటపోరాటాలలో పాల్గొనడం ద్వారా మాత్రమే సాధ్యమౌతుంది. మౌలికంగా ఈ దృక్పథం నుండి మన చిత్రకారులు తప్పిపోకూడదు.

ఇక చిత్రకళ, యితర లలితకళల చిత్రణ విషయంలోని పద్ధతులు ఏమిటి? చిత్రకళ, శిల్పకళ అప్లయిడ్ ఆర్ట్స్ మొదలగునవి లలితకళలలోకే వస్తాయి. చిత్రకళలో వాటర్, ఆయిల్ మీడియంలలో. అలాగే ఎచ్చింగ్, లితో, బాతిక్, లినోకట్ వుడ్‌కట్, సెరమిక్స్, ఫ్రెస్కో, మ్యూరల్స్ మొదలగు ఎన్నోపద్ధతులున్నాయి. అలాగే శిల్పకళలో ప్యానల్, రౌండ్‌మాస్క్ మొ॥ పద్ధతులున్నాయి. ఈ పద్ధతులను మన విప్లవ చిత్రకళకు ఉపయోగించుకోవచ్చు.

అలాగే మన సాహితీరంగంలో అనుసరిస్తున్నట్టే లలితకళల్లో ముఖ్యంగా చిత్రకళలోకూడా జానపద పద్ధతి అవలంబిస్తే మంచి ఫలితాలు సాధించవచ్చు. అలా చేయడానికి జాతకకథలు, తోలుబొమ్మలు మొ॥ జానపద రూపకాల నెన్నింటినో మన చిత్రకారులు అధ్యయనం చేయాలి. వీటితో మొదలయితే ప్రజలలో ప్రచారంలోవున్న ఇంకెన్నో జానపదరీతులను మన చిత్రకారులు పట్టుకోగలరు. నేడు జనచైనాలో వుడ్‌కట్, బుద్ధుని జాతకకథలు మొ॥ ఎన్నో సంప్రదాయ (ప్రాచీన) పద్ధతులను విప్లవ భావాలకు అనుగుణ్యంగా మలచుకుంటున్నారు. ఇందుకు మన కళాకారులు నడుం కట్టాలి— అలాగే మనరాష్ట్రం నలుమూలల్లోవున్న విప్లవ యువ చిత్రకారులకు కూడా శిక్షణ యివ్వాలి. ఇందుకు మన చిత్రకారులు పూనుకొని నూతన ప్రజాస్వామిక విప్లవ విజయానికి తోడ్పడుతారని ఆశిస్తాను.

# "నల్ల" పాటగాడు పాల్ రోబ్సన్

బానిసల జాతి తనది. ఒక భాష బానిసత్వాన్ని ఎన్నడో చట్టరీత్యా రద్దుచేసి బానిసలకు విమోచనం ప్రసాదించామని డాబులుపోయే అమెరికాలో. తిండి మొదలు ఉద్యోగం వరకు గల సమస్త జీవిత రంగాలలో. మనిషి వన్నెను బట్టి వ్యత్యాసాలు, అంతరాలు వివక్ష అమలుజరుపుతూనే వస్తున్న అమెరికాలో, బుకర్‌టి. వాషింగ్‌టన్ డుబాయ్‌స్ లాంటి 'లిబరల్'ల మొదలు బ్లాక్ పాంథర్స్ వరకు ఎన్నో తరాలకు చెందిన నీగ్రోలు పశువులకంటె హీనమైన నరపశువులుగా ఎంచబడుతున్న అమెరికాలో, గొంతెత్తి నిర్భయంగా గుండెవిప్పి నిబ్బరంగా పాడిన, పాటతో పోరాడిన వ్యక్తి పాల్‌రోబ్సన్.

పాల్‌రోబ్సన్ చనిపోయాడు (1976 జనవరి 23). చనిపోనిది ఆయన కంఠస్వరం. ఆయన గానం. ఆయన పోరాట సాంప్రదాయం.

అవమానానికి సంకేతం అనిపించుకున్న "నీగ్రోత్వం" (Negritude) పాల్ రోబ్సన్. మహమ్మదాలీ (హెన్రీక్లే). జో. లూయీస్ లాంటి బ్లాక్‌పాంథర్‌ల వంటి వారి గుండెనిబ్బరం. ఆత్మగౌరవ పరత్వం, పీడిత ప్రజాహృదయాలనుంచి వెలువడుతూ వచ్చిన చైతన్య తరంగాల మూలంగా, నేడు ఒక ప్రాచీన మానవ మహాజాతికి ప్రత్యక్ష గౌరవ ధ్వజంగా పరిణమించింది. "వర్ణ" పోరాటాన్ని వర్గపోరాటంతోటీ, వర్గపోరాటాన్ని సాయుధ ప్రజాపోరాటంతోటీ. ఒక దేశంలో జరిగే సాయుధ ప్రజా పోరాటాన్ని అంతర్జాతీయ విప్లవంతోటి అనుసంధానిస్తూ నేటి దశలో 'నీగ్రోత్వం' పోరాట సంకేతమై వుంది. ఈ చారిత్రిక పరిణామానికి పాల్‌రోబ్సన్ ఎంతోకొంత దోహదం చేశాడు కాబట్టే. ఆయన మరణం ప్రపంచ పీడిత ప్రజలకు విచారకర మౌతుంది.

గత శతాబ్ది ముగిసే నాటికి రోబ్సన్‌ది రెండేళ్ళ వయస్సు. తన తండ్రి బానిస జీవితం నుండి పారిపోయి న్యూజెర్సీ రాష్ట్రంలోని ప్రిన్స్‌టన్‌కు వచ్చిచేరి నలభై ఏళ్ళయింది. 'స్వతంత్ర' పౌరుడుగా జన్మించిన పాల్ 1915 నాటికి చదువు ముగించుకుని, పట్టాతోబాటు పొట్టకూడా చేతబట్టుకున్నాడు. కాని. చివరకు పాల్‌కు కూడు పెట్టింది అతని చదువుకాదు, గొంతుకే.

జర్మనీలో హిట్లర్ మృత్యు పతాకను దేశ దేశాలమీద ఎగరవేసే రోజుల్లో, ఇంగ్లాండుకు వెళ్ళి పదేళ్ళకాలం వుండిపోయిన పాల్, తన 'నీగ్రోత్వం' గురించి గాఢమైన స్పృహ పొందాడు. ఆఫ్రికన్ జాతీయోద్యమాలతోటి, వాటి నాయకులతోటి,

సంబంధం పెంపొందించుకున్నాడు. ఎచ్.జి. వెల్స్ లాంటి బూర్జువా మేధావులతోను, జవహర్లాల్ నెహ్రూ వంటి బూర్జువా జాతీయవాదులతోను స్నేహం సంపాదించాడు. పశ్చిమ ఆఫ్రికా విద్యార్థి యూనియన్ రోబ్సన్‌ను గౌరవ సభ్యునిగా చేసుకొని, తనను తాను గౌరవించుకుంది.

అప్పటికింకా స్టాలిన్ సారధ్యాన శ్రామికవర్గ నియంతృత్వాన్ని కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చిన సోవియట్ రష్యా పాల్ రోబ్సన్‌ను బలంగా ఆకర్షించింది. నీగ్రో జనవిమోచనానికీ సోషలిజానికీ మధ్యగల సంబంధం స్పష్టంగా కనిపించింది. స్పానిష్ ప్రజలు ఫ్రాంకో ఫాసిజం బారినుంచి తమ రిపబ్లిక్‌ను కాపాడుకునేందుకు సాగించిన అంతర్యుద్ధంలో స్వయంగా పాల్గొన్నాడంటేనే, భావాలకూ ఆచరణకూ మధ్యగల అంతరాన్ని రోబ్సన్ దాటగలిగాడని చెప్పవచ్చు.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత, ప్రచ్ఛన్న యుద్ధ దశలో, అమెరికాలో విజృంభించిన కమ్యూనిస్టు వ్యతిరేకత, మెకార్థీ వేట (నిక్సన్ వేట అంటే మరింత నిజం) చరిత్రలో కారునల్లని పుటగా నిలిచిపోయింది. అప్పటికే తన గాత్రంద్వారా 'ఒథెల్లో' పాత్ర ద్వారా ప్రపంచ ప్రఖ్యాతి పొందివున్న రోబ్సన్‌ను కూడా కాటు వెయ్యక మానలేదు. బతుకుతెరువే పోయేంతగా అమెరికన్ పెట్టుబడిదారీ సంగీత, సినిమా వగైరా కంపెనీలు కూడబలుక్కున్నాయి. అయినా, ఈ విషతరంగాన్ని ఎదిరిస్తూ, రోబ్సన్ ప్రపంచశాంతి ఉద్యమంలో పాల్గొంటూ వచ్చాడు. 1947 లోనే ఒక లక్ష డాలర్లు సంపాదించుకోగల్గిన రోబ్సన్ 1952 లో ఆరువేల డాలర్లు మించి సంపాదించుకోలేక పోయాడు ఏ విదేశానికీ వెళ్ళకూడదనే నిషేధాన్ని రోబ్సన్‌పై 1958 వరకు ఎత్తివేయలేదు. అయితే రికార్డుల ద్వారా రోబ్సన్ గాత్రం దేశాల, ఖండాల, సరిహద్దుల నెన్నడో అతిక్రమించింది. ఆనాటికీ, చనిపోయిననాటికీ రోబ్సన్ వ్యక్తిత్వం వెర్రె తివ్వలేదు. పాల్ రోబ్సన్ జీవితం, ఆయన సంగీతం, ప్రపంచ పీడిత ప్రజల ఆత్మోన్నతికే అంకితం.

---

పుస్తక పరిచయం :

# రక్తాక్షరాలు

జూలియస్ ఫ్యూజిక్ రాసిన రక్తాక్షరాలు పుస్తకాన్ని చదువుతున్నామనేకంటే ఈ అక్షరాలద్వారా ఒక మహాశక్తిని, మహోజ్వలమైన ఆశయాన్ని, మహత్తరమైన కార్యదీక్షను, మహోన్నతమైన మానవత్వాన్ని, అచంచలమైన మనోధైర్యాన్ని, అసమానమైన త్యాగాన్ని ఆవిష్కరింప చేసుకుంటున్నామంటే సరిగ్గా వుంటుంది.

జూలియస్ ఫ్యూజిక్ జెకోస్లోవేకియా కమ్యూనిస్టుపార్టీ నిర్మాతల్లో ఒకరు. పాత్రికేయుడు రచయితకూడా. జాతి విముక్తికోసం పోరాడుతున్నాడని, రహస్య పార్టీని, ఉద్యమాన్ని నిర్మిస్తున్నాడని, రహస్యాలు చెప్పడంలేదని ఈయనను నాజీ ప్రభుత్వం 1943 సెప్టెంబరు 8వ తేదీన ఉరితీసింది.

ఫ్యూజిక్ చాల సమర్థవంతమైన పార్టీ నిర్మాత. ఈతనిని అరెస్టుచేయడంలో గాని, ఉరి తీయడంలోగాని నాజీ ప్రభుత్వం ప్రతిభ ఏమీలేదు. ఈయనను పోలీసులు తమ యుక్తి చాతుర్యాలతో అరెస్టుచేయలేదు. చాలా దేశాలలో మాదిరిగా ఒక బాధ్యుని నమ్మకద్రోహ ఫలితంగా అరెస్టుచేయడం జరిగింది. ఒక ఏడాదిపాటు జైల్లో చిత్రహింసలు పెట్టినా ఒక్కమాట కూడా ఆయననుండి రాబట్టుకోలేక పోయింది ఆనాటి రాక్షస ప్రభుత్వం. అందుకే ఆ శిలలాంటి చిత్తస్థైర్యానికి భయపడి, ఓడిపోయి ఫ్యూజిక్‌ని ఉరితీశారు. సామ్యవాద స్థాపనకు ద్రోహదం చేయడంతోపాటు శత్రువు చేజిక్కిన తర్వాత పార్టీనిర్మాణం శత్రువుకి ఎలా చెప్పకూడదో పార్టీలకు వ్యక్తులకు ఎలా ద్రోహం చేయకూడదో ఈయన జీవితం మనకు నేర్పుతుంది. విముక్తికోసం పోరాడుతున్న దేశాలలోని ఉద్యమ నిర్మాతలకు ఫ్యూజిక్ జీవితం ఒక ధృవతారగా ఎప్పటికీ దారిచూపుతునే వుంటుంది.

జైల్లో ఒకపక్క చిత్రహింసలకు గురవుతూ ఈ రక్తాక్షరాలను రచించాడు ఫ్యూజిక్. జైలు కాపలాదారొకరు రహస్యంగా కలం, కాగితాలు అందజేస్తే వాటి సాయంతో ఫ్యూజిక్ కొంత నోట్సు వ్రాశాడు. వాటిని ఆ కాపలాదారు ఎప్పటికప్పుడు భద్రంగా బయటకు చేరవేశేవాడు. అయితే వాటిని ఫ్యూజిక్ భార్య అగస్టినా వేర్వేరు వ్యక్తులవద్ద భద్రంగావుంచిన నోట్స్‌ని తీసుకొని పుస్తకంగా ప్రచురించింది. ఆ జైలు కాపలాదారుని గురించి ఫ్యూజిక్ యిలా అంటాడు. 'ఈ కాగితం ముక్కలతో కటకటాలవెనక బంధింపబడివున్న నేటికీ, స్వేచ్ఛా వాయువులు పీల్చుకోనున్న రేపటికీ మధ్య వారధిని నిర్మిస్తున్నాడు,' అని. 'ఈ రచనలు బయటపడితే అతని తల ఎగిరిపోతుంది' అని అంటాడు.

అగస్తినాను కూడా అరెస్టుచేశారు. 1945 మేలో హిట్లర్ జర్మనీ పతనానంతరం ఫాసిస్టులు పారిపోతూ చిత్రహింసలతో చంపేందుకు వ్యవధిలేక తప్పనిసరిగా ఖైదీలను వదిలివేశారు. అందులో ఈమె ఒకరు. ఈమె భర్తకు తగిన భార్య. ఈమంటే ఫ్యూజిక్‌కు ఎంతో ప్రేమ. ఈమెను జైల్లోకి తీసుకొచ్చి గుర్తింపుకోసం భర్త ముందు హాజరుపరచారు. అప్పటికే తీవ్రంగా దెబ్బలుతిని వున్నాడు ఫ్యూజిక్. అతని మూతి మీదకొడితే పళ్ళూడిపోయి నోరు రక్తంకారుతున్నది. ఆవిడ చూడకుండా వుండాలని తన నోటిచుట్టూవున్న రక్తాన్ని నాలికతో శుభ్రంగా నాకివేయడానికి ప్రయత్నించాడు. కానీ అది అర్థంలేని పనయిపోయింది. అతని నోరూ పెదవులేకాదు, ముఖంలోని ప్రత్యంగుళం చివరకు వ్రేలి చిగుళ్లుసైతం ఆగకుండా రక్తాన్నోడ్చుతూనే వున్నాయి. ఆ పరిస్థితుల్లో 'నీవితన్నెరుగుదువా?' అని అడిగితే 'లేదు! నాకితనెవరో తెలీదు' అన్నది. తనలో పెల్లుబికే సంక్షోభాన్ని కనీసం చూపుల్లోకూడా బయటపడనీయకుండా చెప్పిందామె ఆమాట. ఎంత గుండెనిబ్బరం! తనభర్త అని చెబితే మొత్తం రహస్య యంత్రాంగం అంతా బయటపడిపోతుందని, విప్లవానికి ప్రతీఘాతమవుతుందని ఆమె చెప్పలేదు. ఎంత ఉత్తమురాలామె! ఆమెను గురించి ఫ్యూజిక్ 'నా మనసునిండా హృదయం నిండా నా అగస్తినా నిండిపోయి వుందిప్పుడు. ఔన్నత్యం నింపుకున్న ఆత్మీయురాలామె. సదా ఒడిదుడుకుల మధ్యనే సాగుతూ వచ్చిన ఈ జీవయాత్రలో అపూర్వమనదగిన మిత్రురాలామె' అని అంటాడు. ఆఖరిసారి యిద్దర్నీ కాల్చేస్తామని భయపెడితే ఆమె అంటుంది— 'మీరు నన్ను భయపెట్టలేరు. నా అంతిమ వాంఛా, ఉన్నకోరికకూడా అదే. మీ రితన్ని చంపివేయదలిస్తే నన్నుకూడా చంపివేయండి' అని. ఎంత గాఢమైన ప్రేమ! ఎంత అపారస్థైర్యం!

తనజాతి విముక్తికోసం జరుగుతున్న మహత్తర పోరాటంలో పాల్గొన్న తన సహచరుల గురించి ఫ్యూజిక్ ఎంతో ఉద్విగ్నంగా చెప్తాడు—

"సోషలిజం కోసం నాటిన విత్తనాల్లాంటి వాళ్ళం మేం. ఓ వసంత సుప్రభాతాన ప్రపంచవ్యాప్తంగా మొలకలు వేస్తాం మేం... స్వేచ్ఛామానవుడుదయిస్తాడానాడు. ప్రజలమధ్య సౌభ్రాతృత్వం వెల్లివిరుస్తుందానాడు. మానవత వికసిస్తుందానాడు" అంటూ.

తన తోటివాళ్ళ చిత్రహింసల గురించి చెబుతూ యిలా అంటాడు. 'దృఢంగా, ఆరోగ్యంగా ఉన్నవారెందరో ఆగదుల్లోకి వెళ్లి రెండుమూడు గంటల చిత్రహింసల తర్వాత ఎముకలు విరిగి, చర్మంచిట్లి శవప్రాయంగా తయారై బయటికివస్తుంటారు'

అని. రహస్యాలు చెప్పనివారిగురించి ఎంతో గొప్పగాచెబుతూ జారిపోయినవారిగురించి జాలిపడతాడు. తనగురించికంటే తన సహచరులగురించి ఎంతో అభిమానం ప్రేమతో చెప్తాడు. జైలువార్డర్ల గురించి, జైలు ఉద్యోగుల గురించి చెప్తాడు. జైల్లో తాను గురయిన దారుణ హింసాకాండ గురించి గుండె జలదరించేలా చెప్తాడు- 'కిటికీలోంచి చూసినంత స్పష్టంగా నేనిప్పుడు మృత్యువును చూడగలుగుతున్నానంటూ' మేడే గురించి చెబుతూ మానవునికి అత్యంత పవిత్రమైనది, సుందరతరమైనది అంటాడు.

ఫ్యూజిక్ ఆశయం ఎంత గొప్పదో ఈ పుస్తకమూ అంతే. 1955 నాటికే ఈ రక్తాక్షరాలు 68 భాషల్లోకి అనువదింపబడిందట. తెలుగు సాహిత్యంకూడా ఈ అనువాదంతో కొత్త రక్తాన్ని సంతరించుకున్నది. కొత్తభాగ్యాన్ని సముపార్జించుకున్నది.

ఆంగ్లమూలం చదవకుండా అనువాదం గురించి చెప్పడం భావ్యం కాదు కాబట్టి నేనేమీ చెప్పడంలేదు. ఈ పుస్తకం మాత్రం అనువాదంలాకాక తెలుగులోనే రాసినట్టు అనిపించింది. అందుకు రచయిత శ్రీ చలసాని ప్రసాదరావుని అభినందించాలి. ముఖచిత్రం భావస్ఫోరకంగా వున్నది. అక్కడక్కడా అచ్చుతప్పులు, నాలుగు పేజీలు మొత్తానికే అచ్చుకాకపోవడం (నాకు అందిన ప్రతిలో) జరిగింది.

ఫ్యూజిక్ "తన రాతపని పూర్తయేలోగా నాజీలఉరితాళ్లు నా కంఠాన్ని బిగించివేసే పక్షంలో మిగిలిన కోట్లాది ప్రజలు దీని ముగింపును 'సుఖాంతంగా' విరచించగలరు" అని అంటాడు. ఈ పుస్తకం అందుకోసం పిలుపునిస్తుంది.

– బొజ్జా తారకం

<u>మరాఠీ సాహిత్య సమ్మేళన్:</u>

> రేపటికోసం
> నువ్విప్పుడు పోరిపోదల్చుకున్నా
> ఫాయిదా లేదు
>
> — పోవార్, దళిత్ కవి

# ప్రతిధ్వనులు

గత సంవత్సరం అత్యయిక పరిస్థితిలో కరాడ్ (వై బి చవాన్ స్వంత ఊరు) తర్వాత మళ్ళీ హిందూమత రాజకీయాల రాజధాని పూనాలో నవంబర్ 18 న మొదలయిన మరాఠీ సాహిత్య సమ్మేళన్ 20 న దళిత పాంథార్ల దాడితో అర్థాంతరంగా ముగిసింది.

దుర్గా భగవత్ అధ్యక్షతన జరిగిన గత సమ్మేళన్ "ఖ్యాతి" అందరికి తెలిసింది. ఆ సభలో చవాన్ ముఖ్యఅతిధిగా ఉండగా భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని కాలరాస్తున్నందుకు శ్రీమతి భగవత్ ఎమర్జెన్సీని తీవ్రంగా ఖండించి ఆ సాయంత్రమె మీసా డిటెన్యూగా నిర్బంధింపబడింది. ఆవిడ నిర్బంధాన్ని ఖండిస్తు దేశవ్యాపితంగా మేధావులు ప్రకటనలు చేశారు. ఈ సంవత్సరంకూడా గొడవ ఆవిడతోనె మొదలయింది.

మరాఠీ సాహిత్యంలో ప్రధానంగా రెండు భాగాలున్నాయి. బ్రిటిష్‌వాళ్ల అధికారంతో బ్రాహ్మణ మేధావులు తమ నిజమైన రాజకీయాధికారాన్ని కోల్పోయారు. అప్పటినుండి వాళ్లు సాంస్కృతిక రంగంలో తమ ఆధిక్యతని నిలబెట్టుకొస్తున్నారు. మరోవైపు మధ్యతరగతి సాహిత్యం సాంఘిక వాస్తవికతనికూడా ప్రతిబింబించలేక కేవలం వ్యాపార సాహిత్యంగా దిగజారిపోయింది. జ్యోతిరామ్ పూలె సత్యసదోక్ ఉద్యమం తర్వాత చెప్పుకోదగ్గ సాహితీ ఉద్యమమేదీ మరాఠీ సాహిత్యంలో రాలేదు. మిగతాప్రాంతాలలోగా అభ్యుదయభావాలు మరాఠీ సాహిత్యాన్ని అంతగా ప్రభావితం చెయ్యలేకపోయాయి. ఈ తరుణంలో 70 లలో దళిత పాంథార్లు ప్రవేశించారు. దేశంలో మారుతున్న పరిణామాల కనుగుణంగా వచ్చిన సాంస్కృతిక చైతన్యానికి వాళ్ళు ప్రతినిధులు. సాహిత్యాన్ని ఒక బలమైన ఆయుధంగా గుర్తిస్తూ వాళ్లు శతాబ్దాంతరబడి పాతుకుపోయిన కుళ్లు సంస్కృతిపై తిరుగుబాటును ప్రకటించారు. అది కేవలం దళితులకె పరిమితంగాక మొత్తం సాహిత్యాన్ని ప్రభావితం చేసింది.

మరాఠీ సాహిత్య సమ్మేళన్ ప్రతి ఏటా జరిగే ఒక మొక్కుబడి. మరణించిన సంస్కృతిని ఆవిష్కరించే బతికిపోయిన ఒక రూపం. బ్రాహ్మణ మేధావుల ఆఖరి అధికారపీఠం. ఇక్కడ 21 రూపాయలతో సభ్యత్వాన్ని కొనుక్కోవచ్చు సభ్యులైన వారికి మాత్రమే ఓటుహక్కు ఉంటుంది. ఆర్ ఎస్ ఎస్. నాయకత్వంలో హిందూ మతోన్మాదులు తమ విలువలని మొత్తం సాహితీ ఉద్యమంమీద విధించేందుకు సమ్మేళన్ ఒక సాధనం. అందంగా అలంకరింపబడ్డ మండపం, షెహనాయ్ సంగీతం, సరస్వతీ పూజలతో మొదలయిన సమ్మేళన్ విపరీతంగా వెదజల్లిన డబ్బుల్ని, ట్రక్కులతో అద్దెకు తెచ్చిన "కమిటీ సభ్యుల్ని" కూడా చూసింది. ఫలితంగా అభ్యుదయ విరోధకుల గురువు భావె అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు

హిందూ మతోన్మాదులు రాజకీయ నాయకుల ప్రాపకం కోసం పారిశ్రామికవేత్తల డబ్బులకోసం ప్రాకులాడి తమ విజాయితీనికూడా నిలబెట్టుకోలేకపోయారు. భారతదేశంలో అధికార పార్టీలు ఎంత అభ్యుదయ కబుర్లుచెప్పినా ఈ ఫ్యూడల్ సాంప్రదాయాన్ని సమర్థిస్తూనే ఉన్నాయి. పలితమే ధనం మదంతో, అధికార బలంతో సాహిత్యాన్ని కొనడానికి చేసిన ఈ విఫలహీనయత్నం. సమ్మేళన్‌కి కొద్దిరోజుల ముందుగానే 'మనోహర్' పత్రిక కిచ్చిన ఇంటర్వ్యూలో భావె దళిత సాహిత్యాన్ని బూతు సాహిత్యంగా ఖండించాడు. సభా ప్రారంభంలోనే రాజకీయ నాయకుణ్ని (40వేల విరాళంతో వచ్చిన గోవా ముఖ్యమంత్రి శశికళా కాకోద్కర్) ఆహ్వానించినందుకు శ్రీమతి దుర్గా భగవత్ నిర్వాహకుల్ని తీవ్రంగా ఖండించింది. కార్యనిర్వాహక సమితి ప్రత్యేక తీర్మానంలో ఆవిడని నిరసించినా దాన్ని సభ్యులముందు పెట్ట సాహసించలేకపోయింది.

ఈ మూడు సంఘటనలు అంతకు ముందుమంచి అంతర్లీనంగా సంఘర్షిస్తున్న రెండు ప్రపంచాలమధ్య వైరుధ్యాన్ని సమ్మేళన్ వేదికమీదకి తీసుకు వచ్చాయి. ఆఖరిరోజు దళిత్ పాంథర్లు దుర్గా భగవతీ అభిమానులు రిపబ్లికన్ పార్టీ అనుసరులు పూనే విశ్వవిద్యాలయం విద్యార్థి యూనియన్ నాయకత్వాన పోస్టర్లతో నినాదాలతో ప్రదర్శన జరిపారు. భావె అధ్యక్ష ఉపన్యాసం కొనసాగలేదు. సమ్మేళన్ అర్ధాంతరంగా ముగిసింది. ఏడేళ్లు పోయింతరువాత '70 విశాఖ శ్రీశ్రీ సన్మాన సభలు పూనేలో మరాఠీ సాహిత్య సమ్మేళన్‌లో ప్రతిధ్వనించాయ్.

— మురా

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ స్వాముల అరాచకాలు

సోదరీ, సోదరులారా!

దేశం ముప్పయేండ్లుగా కాంగ్రెసు ముఠాపాలనకింద వుండిపోయినట్లే, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ యిరవై యేండ్లుగా వొకే అధ్యక్ష, కార్యదర్శి శాశ్వతగుత్తాధిపత్యంకిందవుంది. అకాడమీ అమ్మకడుపునుంచీ బైటపడినప్పట్నుంచీ దానికి భర్తలయి కూచున్నారు ఆయిద్దరూ. ఫ్యూడల్ సమాజాన్ని గుప్పెట్లో బిగించుకుని, నిరంకుశాధికారం చెలాయించిన కులానికిచెందిన, ఆ వ్యవస్థకు ప్రతిరూపాలయిన, ప్రతినిధులయిన ప్రభు, పురోహిత పాలకవర్గానికి ప్రత్యక్ష సాక్షులయిన యీ యిద్దరూ అకాడమీని యేకచ్ఛత్రం కింద యేలుకోడం యిరవై యేండ్లుగా సాగుతోనేవుంది. సాహిత్య అకాడమీ, ఒక సంస్థానంగానూ దాని సభ్యులు అధ్యక్ష, కార్యదర్శిగార్లను కైవారంచేసే వంది మాగధబృందంగానూ తెలుగుదేశంలో చైతన్యవంతులైన సాహితీపరులు లేరా? ఈ ముసలి రసికుల్ని తెలుగు సాహిత్యం యెల్లకాలం భరించవలసిందేనా?

సాహిత్యంలో ప్రపంచవ్యాప్తంగా విప్లవాత్మకమైన మార్పులొచ్చినాయి. ఆ మార్పు తెలుగు సాహిత్యం మీదకూడా ప్రసరించింది. నూతనోత్సాహంతో వెయ్యేండ్ల సాహిత్యంలో యేనాడూ యెరగనంత వేగంతో ముందుకు పరుగులెత్తుతోంది. ఈ ఆధునిక సాహిత్య యుగంలో కేవలం పదబంధ పారిజాతాలతో పదప్రయోగ కోశాలతో రామాయణ భారత పునర్పునర్ ముద్రణలతో యెవరూ చదవని యెందుకూ కొరగాని పద్యకవిత్వపు బండిరాళ్ళను యింతింత లావాటివి పేర్చుకుంటూపోతే యేమిటి ప్రయోజనం? ఈ అకాడమీకి, యీ అకాడమీ యిద్దరు వృద్ధహీరోలకూ యీనాడు ప్రపంచం మొత్తంగా సాహిత్య స్వరూపం భాషాస్వరూపం మారిపోయిందని యింకా తెలిసినట్లు లేదు. తెలిస్తే... పద్యసాహిత్యపు యెడారి యిసుకదిబ్బల్లో యింకా కూరుకుపోయివుండరు. గ్రాంధిక భాషాకూపంలో కప్పల్లావుండరు. అకాడమీ సభ్యులుగా అరవైలూ డెబ్బయిలూ దాటిన దస్త్రాలకొద్దీ దస్త్రాలురాసిన చాదస్తుల్నే యెంచుకోరు. సూర్యచంద్రులుగా వర్తమాన ప్రపంచానికి వెలుగునిస్తున్న సాహిత్య భాషాస్వరూపాన్ని యీ అకాడమీ గుడ్డిదీపాలు గుర్తించలేకపోతే వాటికొచ్చిన నష్టమేమీలేదు.

ఈ అకాడమీ సినిమావటి అత్తగారికథల్ని అత్యుత్తమ సాహిత్యంగా గుర్తించి అవార్డులిచ్చే అత్తగారి పెత్తనం నిర్వహిస్తోంది. సాహిత్య అకాడమీనీ దాని అధ్యక్ష కార్యదర్శిని సభ్యుల్ని పొగడుతూ సాహిత్యపు విలువ యేమాత్రంలేకుండా రాయబడిన

వొక పద్యపుస్తకానికి అవార్డు యిచ్చింది. అధ్యక్షునీ కార్యదర్శినీ పొగడితే లేదా తిడితే అవార్డో గ్రాంటో వస్తుందన్న గ్యారంటీ యేర్పడింది. నవలమూ కథమూ గుర్తించని అజ్ఞానంలో వుంటూనే యీ అకాడమీ అవార్డుకి తగినస్థాయిలో రాలేదంటో మూడేళ్ళ నవలనూ రెండేళ్ళ కథనూ తిరస్కరించింది. అవార్డయినా యెంతయిస్తోంది? వెయ్యి న్నూటా పదార్లు! ఒక చిన్నకథకు-పత్రికలు యీనాడు వేలల్లో బహుమతులిస్తున్నాయి. ఏటా రాష్ట్ర ప్రభుత్వంనించీ లక్షల గ్రాంటు రాబడుతోన్న అకాడమీ తన సమావేశాల దర్బారు ప్రదర్శనలకు తన అనుచరుల టి.యేలకూ వేలు ఖర్చుపెడుతోన్న అకాడమీ-...అవార్డుగా యిచ్చేది వెయ్యిన్నూట పదార్లు! అందుకే... ఆ అవార్డుకున్న విలువే అకాడమీకుంది అన్నాడు యిటీవల వొక రచయిత. ఇద్దరు రచయితలు వొక్కసారిగా అవార్డును తిరస్కరిస్తే కొంచెమయినా ఆత్మపరిశీలన చేసుకోలేదు. సిగ్గుపడలేదు అకాడమీ.

తన యిరవై యేండ్ల సాహిత్యసేవను గురించి గొప్పలు చెప్పుకుంటోంది. ఏదీ ...యిరవై యేండ్లుగా ఆధునిక సాహిత్యానికి సంబంధించిన యేవొక్క పుస్తకాన్నయినా ప్రచురించినారేమో చెప్పుకోమనండి. ఈ సాహిత్య అకాడమీ సమగ్రమయిన నిఘంటువు నన్నా తయారుచేసిందా? కందుకూరు, గురజాడ, గిడుగు చిలకమర్తుల వర్ధంతులు మాత్రము జరుపుతోంది. వాళ్ళరచనల్ని యేమైనా ప్రచురించిందా? ఈనాడు వాడుకలో లేని వందల యేళ్ళనాటి అతికృతక ప్రయోగాల్తో నిండిన కవిత్వపు పాతర్లను ఆ ముక్కిపోయిన ధాన్యాన్ని పుస్తకాల బస్తాలకెత్తి పదప్రయోగ కోశాలుగా పదబంధ పారిజాతాలుగా వదిలపరుస్తూన్నారు. కానీ యీనాటి వ్యావహారికంతో తొణికిసలాడే వేమన్న నేమన్నా తలుచుకున్నారా? అభ్యుదయ విప్లవ సాహిత్యం సంగతెందుకు?... దేవులపల్లికి రాయప్రోలుకు అవతల ప్రబంధాలవరకే పరిమితి గీసుకొంది అకాడమీ. అన్ని రాష్ట్రాల అకాడమీలూ ఆధునిక రచనల్ని ప్రముఖంగా గుర్తిస్తూంటే. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మాత్రం... అల్లసాన్నయ్యకు వెనక్కి, విశ్వనాథ పోయినంత వెనక్కి పోతానంటూంది.

అకాడమీ. యింత అభ్యుదయ విరోధకంగా, యింత నిరంకుశ పెత్తందారీతనంతో, యిన్నేళ్లుగా వొంటెత్తు నాయకత్వంతోనే వుండటానికీ, యేయితరభాషల్లోనూ లేనంత సంఖ్యలో రచయితలు యీనాడు తెలుగులోవున్నా యెవరూ అకాడమీని విలదీసి అడక్కపోవడానికీ కారణం ఆలోచించవలసివుంది.

అకాడమీ మాటెత్తితే ప్రతి రచయితా అసహ్యపడతారు. అయితే అకాడమీ ధోరణిమీద నిరసనగా ఐక్యతా పోరాటంలేదు. ఈ సాహిత్య అకాడమీ శవాన్ని, దాని

కుళ్లవాసన్నూ ముక్కుమూసుకుని భరిస్తూనేవున్నారు. అందుకు తగిన కారణమేవుంది. తెలుగు రచయితల్లో, రెండు ప్రసిద్ధ సంఘాలున్నాయి. అవి అరసం, విరసం, అని అందరికీ తెలిసిందే. ఈ పాలకవర్గ, ధనస్వామ్యవ్యవస్థలో వొక భాగంగా, సాంస్కృతిక రంగంనించీ ప్రభుత్వానికి రచయితల బానిసల్ని సప్లయిచేసే స్వచ్ఛంద సేవా సంస్థగ పనిచేస్తోందని అకాడమీని గురించి విరసం అభిప్రాయం. అసలు మూలాన్ని గురించి ఆలోచిస్తూంది కానీ, అకాడమీలాంటి బురదగుంటను గురించి ఆలోచించ లేదు. ఇక అరసం సంగతి. అరసం, సాహిత్య అకాడమీతో సరసంగా, సమైక్యంగా కూడా వ్యవహరిస్తోంది. దానిసభ్యులే దీనిసభ్యులు, సిల్కు జుబ్బాల, సినిమా బూతు పాటల రచయితలే అందులోనూ, యిందులోనూ హీరోలు, పండుగలకూ, తద్దినాలకూ వాళ్ళే అక్కడా... యిక్కడా భోక్తలు, ఈ అకాడమీ కుళ్లలోనించీ, అంతకంటే పెద్ద కుళ్ళుఅయిన ప్రభుత్వ ఆస్థానంలోకి ఆగుంపులోనించే వస్తారు ఫ్యూడల్ సంప్రదాయాల్నీ దాని వారసత్వాన్నీ నిరసించే అభ్యుదయ రచయితల సంఘం, దానిసభ్యుడు సగర్వంగా, సంకోచరహితంగా చిన్నకుళ్లలోనించీ పెద్దకుళ్లలోకి ప్రవేశిస్తూంటే, సంతోషంతో అభినందన తీర్మానాలు చేసుకుంటుంది ఈ అభ్యుదయ రచయితల సంఘం. వుపాధ్యక్షుడుగా వుండిన మహాకవే ఖూనీకోరు అయిన వెంగళరావు కళ్ళను వాల్మీకి శ్రీరాముని పద్మనయనాలను వర్ణించినంతకంటే రసవత్తరంగా, తమ నాయకరాజుల్ని ముద్దుపళని, రంగాజమ్మ వర్ణించినంతకంటే శృంగారంగా, చెప్పుకుని ఆస్థానకవి పదవిని అప్పుడే "రిజర్వ్" చేసుకున్నాడు. కళ్ళూ హృదయమూ మూసుకపోయిన యీ కవికీ, వెంగళరావు కళ్లలోని క్రౌర్యమూ, గూండాయిజం కనిపించనేలేదు. ఈ విధంగా అరసం రాజకీయంగానే కాక, సాంస్కృతిక పరంగాకూడా పాలకవర్గంతో చేయికలపడమేకాక, చేయెత్తి జైకొట్టింది.

ఇంక తెలుగుదేశమంతా రకరకాల సాహిత్య సంస్థలూ, జిల్లా రచయితల సంఘాలు వున్నాయి. చాలావరకూ యివన్నీ యేనాడికొకసారి బ్లాక్‌మార్కెటీర్లనూ, కార్మికుల నోర్లుకొట్టి దోచే యజమానుల్నూ, బడాభూస్వాముల్నూ, లంచగొండి ఆఫీసర్లనూ డబ్బు అడుక్కుని వాళ్ళను నోటికొచ్చినట్లూ పొగిడి వాళ్ళమీద కవిత్వాలు రాసి వాళ్ళ సరదా వీళ్ళ దురదా తీర్చుకొనే సంబరాలుగా దసరా వేషాలుగా దర్శనమిస్తున్నాయి. ప్రత్యేకించి శాలువాలకోసమే కవిత్వం రాసే బూజుకవుల్ని తోలుకొచ్చి బోకుబేరంగా కవి సమ్మేళనాలు జరిపిస్తూ గొప్ప సాహిత్య సేవచేసి అలసిపోయినట్లూ యింకా అకాడమికీ పోయి ఆ హోదా పొందవలసినస్థాయి కొచ్చేసినట్లూ దాని సభ్యత్వం కోసమూ దాని యెంగిలి గ్రాంటులకోసమూ కృషి చేస్తుంటారు. ఆయా సంస్థ ప్రధాననిర్వాహకులు అకాడమీ స్థాయికి తగిన అధముల్ని తయారుచేసివంపే మధ్యవర్తిత్వపుపని చేస్తుంటారు. సాహిత్యపరంగా ఉత్తమ అభిరుచి సంస్థాపరంగా నిర్దిష్ట విధానమూ వుండదు. స్త్రీని భోగ్య వస్తువుగా భావించిన సాహిత్యాన్ని గొప్పసాహిత్యంగా యీనాటికీ భావిస్తూ

అందులోనించీ కారిపోయే శృంగారాన్ని లొట్టలు వేసుకుంటూ చప్పరిస్తూ పెద్దపీఠాలూ రామరాజ భూషణ వేదికలూ అంటూ పేర్లుపెట్టుకొని యీ రాచరిక రసికత్వానికి కేంద్రమైన అకాడమీ ప్రభువుల్ని వాళ్ళ పల్లకీలనూ గనపెట్టుకొంటూ మోస్తూ ప్రారంభోపన్యాసాలూ, అధ్యక్షతలూ నిర్వహించుకుని అంతటితో ధన్యమైనట్టు సంతోషిస్తారు. యీ అకాడమీ ప్రభువులకు, అకాడమీ కొలువుకూటంలో "గోపాలరెడ్డ్యగ్రణీ! నాపాల భూపాల దివ్యన్మణీ" అని స్తోత్రాలు పలికే, తొల్లు కైతలు గిలికే కింకవీంద్రుల, క్రీతదాసుల కీర్తిగానాల ఆభికీర్తి చెయ్యడం బదులు, యింకా ఆకలి తీరనట్టు అట్లాంటి సాహిత్య నేరస్తుల్నే సాహిత్య అకాడమీ సభ్యులుగా, విశిష్ట సభ్యులుగా చేర్చుకుంటారు. అరవైయేండ్లొచ్చి, వొంట్లో వోపిక మనసులో వ్యక్తిత్వం చచ్చినవాళ్ళనే విశిష్టమైన సభ్యులుగా గౌరవిస్తారు. కాలువా కవుల్ని, కాక దంత పరీక్షలు చేసే వ్యాఖ్యాతల్ని, అవధానుల్ని, పద్మశ్రీలను వాళ్ళ రూళ్ళకర్ర పాహిత్యాన్ని గుర్తిస్తుందేకానీ నిజమైన ప్రజా సాహిత్యాన్ని సృష్టిస్తోన్న రచయితల్ని చూడదు అకాడమీ. వాళ్ళనించే తనను తాను కాపాడుకోడానికి "అవార్డు బిచ్చం" పారేస్తుందికానీ, వాళ్ళ సాహిత్యాన్ని పొరపాటునగూడా అకాడమీలోపల అగుపించదు. రచయితలూ సాహిత్య సంఘాలు స్వల్పమైన ప్రయోజనాల కాశించి అనల్ప ప్రయోజనంతో కూడిన సాహిత్యానికి అపచారం చేయకూడదు. రచయితలూ, సంఘాలూ, తనను గురించి పట్టించుకోకుండా ఉండడమో లేక తన దర్బారులో నౌకరీకి కుదురుకోవడమో కోరుకుంటుంది అకాడమీ. అట్లా అయితేనే, తనకు అడ్డూ ఆపూ వుండదు. తన నెత్తిమీది కిరీటానికీ, తన భుజకీర్తులకూ తాపులుండవు.

కనుక అభ్యుదయవాదులూ, ప్రగతిశీలభావాలు కలిగిన రచయితలూ సాహిత్యాభిమానులూ, సాహిత్యంమీద గౌరవమున్న బాధ్యతాయుతమైన ప్రజలూ, యీ సాహిత్య హత్యా అకాడమీస్వాముల అరాచకాల్ని అడ్డగించవలసివుంది. 'ఈరోజు యిక్కడ... ఇంకో రోజు యింకోచోట, యీరోజు ఇద్దరూ ముగ్గురు రేపు యిన్నూరు, మున్నూరు వేలాదిమంది యీ అకాడమీని నిలబెట్టి... యిరవైయేండ్లనించీ యెన్ని లక్షలు మేసి, యేంచేసినావు? ఎంతమంది ఆశ్రితులకు యేకుమ్మా యేదూ గ్రాంటుసౌకర్యాలు కల్పించినావు? ఆ పరిశోధనా, యీ పరిశోధనా అని చెప్పి యెవరెవరికి, నిన్నే నమ్ముకున్న దాసులకు భుక్తినీ ముక్తినీ యిచ్చినావు?" యిట్లా అడగవలసివుంది. అంతేకాదు .. యీ కాలువా కవుల సాహిత్య వంతల్ని యెంగిలివుపన్యాసాల్ని చవకబారు అవధానుల్ని ఇంకా అకాడమీ లోపల బయట తిరుగుతున్న కాకస్‌లాంటి మూతాగాళ్ళను చెంచాగాళ్ళను నిలదీయాలి. వీళ్ళు సాహిత్యానికీ సమాజానికీ ద్రోహులు. ఆధునిక సాహిత్యంపట్ల యిదిచేస్తున్న తప్పిదానికి నేరానికి వీళ్ళమీద న్యాయవిచారణ జరిపించాలి.

ప్రొద్దుటూరు
10-11-77

రాడికల్ రైటర్స్ ఫోరమ్

## లేఖలు :

### సృజన - జనతా - చైనా - బాదర్‌గ్రూప్

సృజన పునర్జన్మ, హేమలతపై హైకోర్టులో కేసు కొట్టివేయడం ముదావహం.

సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ మూడు సంచికల్లోను, చాలవరకు పేలవంగా అన్పించినవి. నవంబరు సంచికలో ప్రచురించబడిన రెండు లేఖలు (ఒక విమర్శ – మల్లిక్), సంపాదకీయం గురించి... (పి. నిర్మల తదితర్లు) చాలావరకు హేతుబద్ధమైన సరియైన విమర్శ.

ఈ మధ్య మనదేశములో వచ్చిన మార్పుల వలన 'జనతా' ప్రభుత్వం, మరియు విప్లవకారుల కార్యక్రమంతో మార్పులు - వలన, మరల పార్లమెంటరీ డెమోక్రసీపై మరింత భ్రమలు పెరిగే అవకాశం యున్నది.

మన ప్రక్కనున్న సోషలిస్టు చైనాలోకూడ యీమధ్య చాలా మార్పులు వచ్చినవి. యివి మావో చివరిరోజుల్లో మరియు తదనంతరం వచ్చిన మార్పులు, యీ మార్పులగురించి ఏవ్యక్తి కూడ ఆలోచించకుండ, చర్చించకుండ, నిర్ణయానికి రాకుండ వుండలేదు. అలావుంటే 'కమ్యూనిస్ట్ వాన్‌గార్డ్' కాలేడు

పూర్వం రష్యాలో కృశ్చేవ్ వచ్చిన తదుపరి వచ్చిన మార్పుల్ని పెట్టుబడిదారీ దేశాలు, ప్రభుత్వాలు, పేపర్లు ఎంత హర్షించాయో, యిప్పుడు చైనాలో మార్పుల్ని కూడ అంతకంటే ఎక్కువగా హర్షించుచున్నారు 'శత్రువు పొగుడుతూ వున్నాడంటే నీవు తప్పటడుగువేశావు అన్నమాట శత్రువు విమర్శించితే నీవు కరెక్టుదారిలో వున్నావన్నమాట' అనే మార్క్సిస్టు సూత్రీకరణను గుర్తించుకోవాలి. అల్బేనియా పార్టీ విమర్శగురించి ఆలోచించాల్సినది ఎంతైనా వున్నదనుకుంటాను యీరోజు గార్డియన్ పత్రికల్లో, చైనాలో బోనస్‌లు కార్మికులకు యివ్వాలని ఆలోచించుచున్నట్లు కూడా వ్రాసినది।

చైనాలో జరుగుతున్న మార్పుల్ని కొంతమంది 'గుడ్డిగా' ఆలోచించకుండ చర్చించకుండ, విమర్శించకుండ అనుసరిస్తూ వున్నట్లు అన్పించుతూ వున్నది.

జర్మన్ జైళ్ళలో 'బాదర్ గ్రూప్' హత్యలను గురించి సృజనలో ఒక్క వాక్యం కూడ లేకపోవటం నాకు ఆశ్చర్యముగా యున్నది. కనీసం వి. ర. సం. సంతాపం తెల్పుతూ ఒక వాక్యమైనా వ్రాస్తారని అనుకొన్నాను (వాళ్ళు టెర్రరిస్టులు ఐనప్పటికీ).

సృజనలో సి. నా. రె, దాశరధి. విశ్వనాధ సత్యనారాయణ లాంటి వాళ్లగురించి వ్రాసి సమయం, పేపరు వృధాచేయకండి.

అనువాదాలు, పెద్దకథలు తగ్గించి చిన్నకథలు ఎక్కువ వేస్తే సృజన మరింత బాగా వుంటుందనుకుంటాను.

— ఒక పాఠకుడు

24-11-77

లండన్

## భాష - విస్తృత ఐక్యసంఘటన - స్టాలిన్

నవంబరు 77 సంచిక చూసేను.

మధుసూదనరావుగారి వ్యాసం బావుంది గాని భాషమాత్రం । ఇదే సంచికలో భాషగురించి ఉషాదేవి లేఖ వుంది. మాట్లాడుకునే భాషని మించిన పనికివచ్చిన భాష మరోటిలేదు. సమాసాలు ధన్ ధన్ ఝన్ ఝన్ శబ్ద కవిత్వాలు చెయ్యడం సుఖవేగాని మాట్లాడుకునే భాషలోనే, రచనలు చెయ్యడం అతిః కష్టమైన పని.

'రచనలు కావాలి' అన్నారు. బానేవుంది. మీకు Rigid కొలతబద్దలు అవి వున్నాయేమో అని సన్దేహమ్. "జపాన్ వ్యతిరేకత" నామమాత్రంగానైనా ప్రకటిస్తే సహాయపడతాం అని అప్పటి చైనా కమ్యూనిస్టులు చియాంగ్ కైషేక్‌కి చెప్పేరు. ("చైనాపై అరుణతార" ఎడ్గార్ స్నో) Rigidity తగ్గించి broad objective గా ఆలోచిస్తే మీకు మంచి రచనలు కొత్తవాళ్ళనుంచి వస్తాయనుకుంటాను. కొత్త అంటే మీ పత్రికకి కొత్త. మాది వ్యాపారంకాదు రచనలకి పారితోషికం వుండదని boldగా ప్రకటించండి.

జె. వి. స్టాలిన్ గురించి మీరు వ్యాసాలు వగైరా ప్రచురించాలి. బ్రిటిష్‌వాళ్ళు బెర్నార్డ్‌షాని తొక్కిపెట్టినకంటే మరీ ఎక్కువగా రష్యావాళ్ళు స్టాలిన్ని తొక్కిపెట్టేరు।

— నిష్కల వెంకటరావు
విజయనగరం

29-11-77

## అక్టోబర్ సృజన సంపాదకీయం గురించి

సృజన సంపాదకీయాన్ని గురించి మేం చేసిన విమర్శమీద డిసెంబర్ సంచికలో శ్రీ రవిగారు వ్రాసిన విమర్శ చూశాం.

విమర్శ నిర్మాణాత్మకంగా వుండాలని సెలవిచ్చారు వారు. చైనాను గురించి తీర్పుచెప్పటానిక్కి కావలసిన అన్ని విషయాలూ చెప్పటానిక్కి మాకేదో భావం అడ్డుపడిందని వారనుకుంటున్నారు. అవును, సృజనయొక్క పరిమితులు, అన్ని విషయాలను చెప్పటానిక్కి మాకు అడ్డం పడ్డాయి. అంతేకానీ విషయాలు చెప్పలేకాకాదు, తెలియకాకాదు.

చైర్మెన్ మావో మరణించిన నాటినుండీ ఈనాటివరకూ చైనా నాయకత్వం అనుసరిస్తున్న పద్ధతులు చాలవా తీర్పుచెప్పటానిక్కి? చైనాపార్టీకి గుండెకాయలాంటి పెకింగ్‌రెవ్యూ సమాచారాన్ని విశ్వసించక పోతేమరి దేన్ని ఆధారంగా మనం చైనాను విశ్వసిద్దాం। పోనీ అల్బేనియాపార్టీ ఈనాడు చైనా ఎడల అనుసరిస్తున్న వైఖరిచాలదా?

యూరో కమ్యూనిజంలో విప్లవాత్మకతను చూస్తున్న చైనా నాయకత్వం యొక్క ధోరణి ఫాలదా తీర్పు చెప్పటానికి? మనందరం ఘనంగా కీర్తించిన మహత్తర సాంస్కృతిక శ్రామికవర్గ విప్లవాన్ని నడిపించిన వారందరూ ఈనాడు ద్రోహులుగా ప్రకటించబడి, ఆ సాంస్కృతిక విప్లవంలో ప్రజలచేత విమర్శింపబడి, ద్రోహులుగా, రివిజనిస్టులుగా, పదవీచ్యుతులైన వాళ్ళంతా ఈనాడు అధికారస్థానాల్లో ఉన్నారన్న విషయం వాస్తవం కాదా? ఇంకా మీరు వాళ్ళ ఆచరణచూస్తే ఓ నిర్ణయానికి రాదల్చుకుంటే మాకభ్యంతరం లేదు. ఎందుకంటే, ఈనాటికీ రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదాన్ని గురించి తెలియని అమాయక కమ్యూనిస్టులు చాలామంది వున్నారు. కాబట్టి, ఇప్పటికే పత్రికవారికి అభ్యంతరం కల్గించే విషయాలను వ్రాశాం. అందువల్ల ఇంతటితో విరమిస్తూ, ఈ విషయాలను గురించి మనం పర్సనల్‌గా మాట్లాడుకుంటే బాగుంటుందేమో ఆలోచించమని రవిగార్కి విజ్ఞప్తి చేస్తున్నాం.

— సి. స్నేహలత, పి, నిర్మల, ఐ. సుజాత
ఏలూరు

## ముద్దార్ వేణు లేఖపై

సృజన— డిసెంబర్ సంచికలో, శ్రీ ముదార్ వేణు, "అనంతపురం చైతన్య సాహితి" విచ్ఛిన్నకుల్లో ఒకరిగా నా పేరును పేర్కొన్నారు. 'రక్తగానం'. వెలువడే వరకూ అనంతపురంలో చైతన్యసాహితి వుందనికూడా నాకుతెలీదు. చైతన్య సాహితిని జిల్లా స్థాయిలో వ్యాప్తిచేయాలనే వుద్దేశంతో, జిల్లాలోని రచయితల్ని ఒకచోట సమావేశపరుస్తూ, చైతన్యసాహితి నిర్వాహకులు నాకో వుత్తరం రాశారు. ఆ సమావేశంలో నేను పాల్గొన్నాను. ఆ సమావేశంలోనే నన్ను చైతన్యసాహితి అధ్యక్షులుగా వుండమని అడిగారు, నేను నిరాకరించాను. చైతన్యసాహితిని విరసంలో భాగంగా చేరిపొమ్మని నేను సూచించాను. కాని చైతన్యసాహితి ప్రత్యేక ప్రతిపత్తిగల సంస్థగా వుండాలనే భావించారు, నేను సమావేశం నుండి నిష్క్రమించాను. చైతన్యసాహితికి నాకూగల సంబంధం అంతవరకే! చైతన్యసాహితిని విరసంలో చేరిపొమ్మన్నందుకే ముదార్ వేణుగారికి నేను విచ్ఛిన్నకునిగా కన్పించానేమో మరి!

ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమాన్ని నిర్మించడంలో విఫలమైనందునే చైతన్య సాహితి నీరుగారి పోయింది. ఒకరు విచ్ఛిత్తిచేస్తే కూలిపోయేంత చైతన్యరహిత మైనదా చైతన్యసాహితి?

— ఎన్. నారాయణచౌదరి
22-12-77 తెలుగుపండిట్, చెన్నేకొత్తపల్లి

## ఉప్పెన - ఒక రిపోర్టు

తుఫాను, ఉప్పెన భీభత్సానికి గురియైన దివిసీమ తదితర ప్రాంతాలను ఒక అధ్యయన దళంగా తిరిగి రావాలని విప్లవ రచయితల సంఘం, వరంగల్ యూనిట్ 10 డిసెంబర్ రోజున నిర్ణయం తీసుకున్నది. అంతకు ముందుగా నవంబర్ 24 న దివిసీమకు వెళ్ళివచ్చిన వరంగల్ వైద్యబృందం యిచ్చిన రిపోర్టు ప్రోత్సాహ ప్రోద్బలాలు ఈ నిర్ణయం మరింత నిర్మాణాత్మక రూపంలో ఆర్థిక వైద్య సహాయాలతో కూడినదై వుంటే బాగుండుననిపించింది. సహాయ నిధి వసూళ్ళకు, ఈ ఆలోచనకు పౌరహక్కుల సంఘం నుంచికూడ ప్రోత్సాహము, సహకారము లభించింది.

సహాయనిధికొరకు విరసం యూనిట్ పౌరహక్కుల సంఘ బాధ్యులు తిరగడమే ఒక అనుభవమైంది. సహాయం చాలచోట్లనుంచి లభిస్తున్నది. వాళ్ళకిప్పుడు కావలసింది సేవ... ఇంత ఆలస్యంగానా విరసం కదిలితే... ఇప్పటికే చాలమంది వచ్చి వసూలు చేసుకపోయారు. ఇప్పుడేముందని వెళ్ళిచూడడానికి... తుఫాను ముందుకన్నా అక్కడివాళ్ళు ఎన్నోరెట్లు ధనికులయ్యారు, బిచ్చమెత్తడానికి అలవాటుపడ్డారు, సాయం పొందిన చెయ్యిదాచి మరోచెయ్యి చాస్తున్నారు. బియ్యం. బట్టలకు కొదువలేదు. వైద్య సౌకర్యానికికూడ లోటులేదు. ఊరూరా డాక్టర్లువున్నారు. పేదలకు ఇదివరకు ఉన్నదీ లేదు, ఇప్పుడు పోయిందీలేదు. పైగా రైతులు వాళ్ళకు కోతలకోసం అడ్వాన్సుగా యిచ్చిన అప్పులు తినికూచున్నారు. ఇప్పుడు కోతలకుకూడ పోవడంలేదు. అయాచితంగా వస్తున్న ప్రభుత్వ, స్వచ్ఛంద సంస్థల సహాయం రెండుచేతులా జుర్రుకొని కోతలకు వెళ్ళకుండా, పనికిపోకుండా సోమరులవుతున్నారు. ఏవస్తువిచ్చినా అమ్ముకొని డబ్బు ఇస్తే సరేసరి తాగిపడిపోతున్నారు. ఎటొచ్చీ రైతులు అటు పంటలుపోయి, ఇటు ఇల్లు గుల్లయి, మిగిలిన పంటలుకూడ కోసేవాళ్ళు లేక, మధ్యతరగతి స్వభావంవల్ల చెయిజాచటం తెలియక బాధలుపడుతున్నారు. వాళ్ళకేసాయము అందడంలేదు ఇంటికే తీసుకవెళ్ళి ఇస్తేతప్ప– ఇలాంటి రకరకాల అభిప్రాయాలు విన్నాము. మొత్తానికి మాటలు ఏం చెప్పినా సానుభూతితో విరసం, పౌరహక్కుల సంఘం నిజాయితీపట్ల విశ్వాసంతో విరాళాలు యిచ్చారు.

వెళ్ళి పరిశీలించి వచ్చిన కొందరు మాత్రం రెండు నిర్మాణాత్మకమైన ఆలోచించదగిన సూచనలు చేసారు. వ్యవసాయకూలీలు, పల్లెకార్లు పనులకు పోవడానికి సిద్ధంగానే వున్నారు. పిల్లలను, తమవాళ్ళను పోగొట్టుకొని మానసిక వ్యధకు గురియైనా

తవిమూవాలని, బిచ్చమెత్తాలని లేదు. కాని పసిపిల్లలను నిరాశ్రయంగా ఎక్కడ వదిలి వెళ్ళాలి, మాకు తలదాచుకోవడానికి కాస్త గుడిసెపైనా వేసియిస్తే పనులకు పోతామంటు న్నారు వ్యవసాయ కూలీలు. అలాగే పల్లెకారులకు (జాలర్లకు) వలలు సమకూరిస్తే వాళ్లకూడ మళ్ళీ సముద్రం మీదికి పోతారు. (తనను నమ్ముకున్న సముద్ర సంతా నాన్ని ఉప్పెనతో ముంచేసిన సముద్రానికి పోతారు మళ్ళీ) పోతే వీళ్ళకు లాంచర్లు కావాలి వ్యవసాయకూలీలకు కొడవళ్లుకావాలి, గొంగళ్లుకావాలి అవి చెప్పారో కాయన పల్లెకారుల మూలల ఇళ్ళు ఊరికి దూరంగావున్నాయి. వాళ్ల ఊళ్ళోవున్నా గట్టిఇళ్ల జాలలోకి పరుగెత్తుకొని వచ్చేలోగానే ఉప్పెన ముప్పుకు లోనయ్యారు. కనుక వాళ్ళకు మళ్ళీ ఊరిబయట ఆశ్రియాలు నిర్మిస్తే తిరిగి అదే ఉపద్రవానికి గురవుతారు కనుక ఊరిమధ్యన, తీరానికి దూరంగా పక్కా నిర్మాణాలు, కమ్యూనిటీ హాళ్ళలాంటివి కట్టాలి అన్నారు

ఇన్ని సూచనలు విన్నాక స్వయంగావెళ్ళి చూసాకే వాళ్ళకేది అత్యవసరమో అది కొనిద్దామనుకొని 17 వ తేదీ సాయంత్రం గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో ఏడుగురు సభ్యుల దళంగా బయల్దేరింది వరంగల్ విరసం, పౌరహక్కుల సంఘం.

విజయవాడలో ప్రవేశిస్తున్న దగ్గరనుంచి ఆరంభమైంది ప్రకృతికరాళ నృత్యానికి బలియైన నాగరిక జీవన సౌందర్య శిధిలదృశ్యం 'అక్రమంలోకూడ ఒక క్రమముంది' చెట్లు ఒక లయతో విరిగాయి. ఎలక్ట్రిక్, టెలిఫోన్ కంబాలు ఒకే తీరున వంగిపో యాయి. తీగలు ఒకే శ్రుతిలో తెగిపోయాయి పశువుల కళేబరాలు. కుళ్ళు కంపు అవనిగడ్డ నుంచే అదరగొడుతున్నది. అవనిగడ్డలో ప్రవేశిస్తూనే గాంధీ క్షేత్రం (మండలి వెంకటకృష్ణరావుగారు ఎన్నికలదృష్ట్యా నింపుకుంటున్న గోడౌన్) మొదలు కొని దివిసీమ గ్రామీణ పేదల సహాయ కమిటీ కార్యాలయందాకా (ఈ ఒక్క కార్యా లయానికే బోర్డు లేదు) వరుసగా పెద్దపెద్ద బ్యానర్లతో సహాయ శిబిరాలు వున్నాయి. దేశంలో ఎన్ని పార్టీలు వున్నాయో, ఎన్ని స్వచ్ఛంద సంస్థలున్నాయో తెలియనివారికి అది ఒక జాబితా నందిస్తుంది.

అవనిగడ్డలో రెండు మూడు గంటలు ఆగి జనరల్‌గా ఆ ప్రాంతం పరిస్థితుల గురించి దర్యాప్తు చేసాము.

"ఈ ప్రాంతంలో పశునష్టం తీవ్రంగా జరిగింది. మిగిలిన పశువులకు పశు గ్రాసం ఇస్తానని ప్రభుత్వం ప్రకటించింది గానీ ఇంతవరకూ అలాంటి ప్రయత్న

మేమీలేదు. నర్సింహపురం ప్రాంతంలో గొడ్లకు గాడి వచ్చింది. వ్యాక్సినేషన్ గానీ చికిత్సగానీ ఏమీ జరగడంలేదు. కుటుంబానికొక ఫీడింగ్ బ్యాగ్ ఇస్తామన్నారు- అదీ లేదు సబ్సిడీలేదు. దివి సీమలో అరవైవేల దాకా పశునష్టం జరిగివుంటుంది. తాలూకా మెస్‌గా చెప్పబడుచున్న గాంధీ క్షేత్రానికి 30 క్యాన్లు (1200 లీటర్లు) కోడూరు 30 క్యాన్లు, భావదేవరపల్లి, మందపాక 40 క్యాన్లు ఉచితంగా పంచు తున్నారు. అవనిగడ్డ ఫిర్కాలో నవంబర్ 15కు ఇప్పటికి పాలసేకరణ నాలుగువేల నుంచి 1600 లీటర్లకు తగ్గింది. గన్నవరం తాలూకా వీరంకిలాకు చిల్లింగ్ సెంటర్ (పాల శీతలీకరణ కేంద్రం) నుంచి పాలు పంపిస్తున్నారు. మొదట్లో జనానికి డైరీ ఫామ్ సిబ్బందే పంచేవాళ్ళు. 3వ తేదీ నుంచి రెవెన్యూ వాళ్ళకు యిచ్చివస్తున్నారు. రెవెన్యూ వాళ్ళు కొన్నాళ్ళు బియ్యం కార్డులపై పంచారు. సరియైన పద్ధతేమీలేదు." ఒక ఉద్యోగి చెప్పిన మాట.

కంఠంనేని రవీందర్‌రావు ఇంటిలో అరోజు సహాయకమిటీ మీటింగు. ఆ ఇల్లు ఒక సత్రంలాగుంది. గ్రామీణ పేదల కమిటీ దివి రేపల్లె, బాపట్ల వాళ్ళ కరపత్రాల కట్టలు. ఒ.పి.డి.ఆర్. కరపత్రాలు కూడ కనిపించాయిక్కడ.

అవనిగడ్డ కంఠంనేని రవీంద్రరావు అడ్వొకేటు (దివి తాలూకా గ్రామీణ పేదల సంఘం) గారి ఇంటిదగ్గరే హరిపురానికి చెందిన శివనాగయ్యగారు కలిసారు. "భావ దేవరపల్లి – చిన్నారులో ప్రతి ఇల్లూ ఒక గోడౌన్. అక్కడికి వెళ్ళికూడ మీరు చూడాలి. కోడూరు ఫిర్కా ఎలాగూ వెళ్తున్నారు. రేషన్ పంపిణీలో అవకతవకలు ఎన్నని చెప్పను, ఒక్కరికీ అదే రేషన్. పదిమందికీ అదే రేషన్. మేం ప్రతి గ్రామంలో ప్రజా కమిటీలు ఏర్పాటుచేసాం. వాటిద్వారా పంపిణీ న్యాయంగా జరుగు తున్నదని ఆర్. ఎస్. ఎస్. వాళ్ళు, చాలమంది మంచి అధికారులూ కూడ ఒప్పుకొంటు న్నారు. మార్వాడీ రిలీఫ్ సొసైటీ కలకత్తా వాళ్ళు సహాయం చేయాలని వచ్చినప్పుడు 'అట్టడుగు వర్గాలకు అది చెందాలంటే కమ్యూనిస్టుల ద్వారానే సాధ్యమ'ని ఒక ఆర్.ఎస్.ఎస్. కార్యకర్త సలహా యిచ్చాడు. వాళ్ళ విచారణలోకూడ అదే తేలి మా ద్వారానే పంచిపోయారు. శవాలను తొలగించే విషయంలో ఆర్. ఎస్. ఎస్, ఆనంద మార్గ్ వాళ్ళు చొరవ చూపుతున్నారు. అయితే ఆర్. ఎస్. ఎస్. సంస్కారాలు, కర్మ లాంటి చాదస్తాలు పెట్టుకున్నది కాని ఆనందమార్గ్ వాళ్ళు అలాంటి దేమీలేకుండా ఎంతో మామూలుగా చేసేస్తున్నారు." అని చెప్పారు శివనాగయ్యగారు. హరిపురం చుట్టుపట్ల గ్రామాల్లో ప్రాణాలురక్షించి, సాయంచేసిన, చేస్తున్న కమ్యూనిస్టు కార్యకర్త ఇతడు.

అప్పటికే విజయవాడ నుంచి అవనిగడ్డదాకా, అంతకుముందు ఆ ప్రాంతాలకు వెళ్ళివచ్చిన వాళ్ళకూడ సహాయం పొందిన ప్రాంతాలు, 'పందికొక్కులు' దింపుకున్న గోడౌన్లు చూడాలంటే భావదేవరపల్లికి, సహాయంకోసం ప్రజలు సంఘటితమై పోరాడుతూన్న ప్రాంతాలు చూడాలంటే కోడూరు ఫిర్కాకు వెళ్ళాలని చెప్పినసలహా మామనసులో మసలుతూవున్నది. అవనిగడ్డనుంచి అటువెళ్ళాలి.

దివిసీమ పేదలకు నిజమైన సేవచేస్తున్న దివిసీమ గ్రామీణ పేదల సంఘ బాధ్యులను కలిసాము. శివనాగయ్యగారు మా ప్రయాణం, మార్గమ్యం సులభం చేసారు. కోడూరుకు లారీలో ప్రయాణం. కాలువగట్టునవే రోడ్డు. మా లారీలో మాతోపాటు ఆ ఉప్పెన ఉపద్రవానికి గురియైన ఎందరో ఎన్నోకథలు వినిపిస్తూ, ఒక కార్యకర్తను ప్రశ్నించాం. ఆయనే చెప్పకున్నాడు తాను కృష్ణరావుపార్టీ అని. 24న ఇటువైపు వరంగల్ డాక్టర్లు వచ్చేదాకా ఎవ్వరూరాలేదు. తర్వాత సుందరయ్య వచ్చాడు రాజేశ్వరరావు వచ్చాడు. ఎన్నితీర్ల కమ్యూనిస్టులోకాని అందరికన్నా అండర్ గ్రౌండులో వున్న చల్లపల్లి శ్రీనివాసరావు బాగా పనిచేస్తున్నాడు. ఆయన 19నుంచే ఈ ఊళ్లన్నీ తిరిగాడు' అని చెప్పాడు.

కోడూరులో దిగి పౌరహక్కుల పరిరక్షణ సంస్థ (ఒ పి డి ఆర్) వాళ్లు నిర్వహిస్తున్న ఉచిత చికిత్సశాలలో మావెంట తెచ్చిన మందులు వదిలి కాలినడకన దింటిమెరకకు బయల్దేరాం. ఒ పి డి ఆర్ క్లినిక్‌లో హైదరాబాదు నుంచి వచ్చిన ఇద్దరు హౌస్‌సర్జన్లు పనిచేస్తున్నారు. ఈ క్లినిక్ నెలరోజులనుంచీ ఒ పి డి ఆర్ నిర్వహిస్తూవున్నది. ప్రభుత్వ ఆరోగ్య వైద్యశాఖనుంచి డిమాండ్‌చేసి సాధించుకున్న మందులేకాకుండా ఎన్నోస్వచ్ఛంద సంస్థలు, రోటరీ క్లబ్‌లాంటి సంస్థలు, వ్యక్తులుగా డాక్టర్లు యిచ్చిన మందులు జనవరి చివరిదాకా కూడ రోజుకు వందమంది చొప్పున చికిత్సచేయడానికి సరిపోయేన్ని మందులిక్కడ వున్నయి.

దింటిమెరక— సముద్రానికి అరుమైళ్ళదూరం. కోడూరు నుంచి ఒకమైలు. (సముద్రం మెరికేస్తే ఏర్పడిన దిడ్డిఅనాదీవర్గం?) 'నాగిరెడ్డి కుట్రకేసు'లో నాలుగు సంవత్సరాలు శిక్షపడి ఎమర్జెన్సీ ప్రకటించబడిన నాటినుంచి రహస్య జీవితం గడుపుతున్న కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్య కేంద్రం (మార్క్సిస్ట్–లెనినిస్ట్) నాయకుడు చల్లపల్లి శ్రీనివాసరావు గ్రామం ఇది. కట్టవెంబడి మాలపల్లి, పల్లెకారుల ఇళ్లవున్నాయి.

ఆపక్కన సుత్తీ-కొడవలి చెక్కబడిన చల్లపల్లి శ్రీనివాసరావు ఇల్లు. అక్కడికి ఆరు మైళ్ళదూరం నుంచి కెరటంతో కొట్టుకవచ్చిన పడవవుంది ఉప్పెన రోజున ఎనభై మందికిపైగా పల్లెకారులను రక్షించిన ఆ ఇల్లు, ఆ ఇల్లాలు వసుమతిగారిని చూసాము. (ఆ వివరాలు కె వి. రఘునాథరెడ్డిగారు పత్రికలకు చెప్పేవున్నారు ) ఇంకొక ఊరికి బయల్దేరి పోదామని అనుకొంటున్నాం. ఇంతలో ఒక ఉన్నతపాఠశాల విద్యార్థుల, అధ్యాపకుల బృందం లారీనిండా సామాన్లతో వచ్చారు ఎవరో ఇంతలో 'పొలంలో శవాలున్నాయి- చూస్తారా' అని ప్రశ్నించారు. శవాలాపొలంలో ఫిర్కా కేంద్రమైన కోడూరుకు మైలుదూరాన. ఉప్పెనవచ్చిన దాదాపు నెలరోజులకు డిసెంబర్ 18 న మిలిట్రీవచ్చి ఏం చేసింది? ఆదేవనిలో అద్భుతంగా, అపూర్వంగా, అమోఘంగా నిమగ్నమయ్యారని చెప్పుకుంటున్న ఆర్. ఎస్. ఎస్. ఆనందమార్గులు ఏం చేసాయి? పొలాల్లోకి నడిచాము. మావెంట ఆ పాఠశాల విద్యార్థులూ వచ్చారు ఆ పొలంలో శవం కర్రా సుబ్బారావు అనే 20ఏళ్ళ హరిజనయువకునిది. పశులకాపరికి 'పెళ్లయిందా' అని అడిగా. 'గొడ్లకాపరికి పిల్లనెవరిస్తారండి' అన్నాడు మావెంటవచ్చిన గ్రామవృద్ధు. ఈ ఉప్పెనలో తల్లీ, అన్న, వదిన ఇంకొక అన్నకూడ చచ్చారు. ఆ శవాన్ని కాల్చాలని ప్రయత్నించాం. ఎండుపుల్లలు లేవు. కిరోసిన్ లేదు. అప్పుడు తెలిసింది ఆవూళ్లో మిగిలిన కుటుంబాలు కూడ వంటచెరుకుకు, కిరోసిన్‌కు ఎంత అవస్థపడుతున్నారో. చివరకు ధనిక రైతుగా లెక్కించదగిన శ్రీనివాసరావుగారి ఇంట్లోకూడ కర్రలులేవు. కిరోసిన్ లేదు. మరి కిరోసిన్ ప్రభుత్వం ఇవ్వడంలేదా అంటే ఒక అరలీటర్ కిరోసిన్ కోసం. ఒకకిలో బియ్యం రేషన్‌కోసం జనం దింటిమెరకనుంచే కాదు, శ్రీరాంపురం పాలకాయ తిప్పలాంటి ఆరుమైళ్ళ దూరంలోవున్న గ్రామాలనుంచి కూడ కోడూరుకు వెళ్ళాల్సిందే ఈ జనం- పిల్లలను పోగొట్టుకున్న తల్లులు. తల్లులను పోగొట్టుకున్న పిల్లలు. భార్యలను పోగొట్టుకున్న భర్తలు. భర్తలను పోగొట్టుకున్న భార్యలు. కాలి కడుపు. బతికిన ఈ కడుపుకు ఆకలివుంది. మిగిలిన ఈ చూపుల్లో కన్నీళ్ళుమిగల లేదు. నడుస్తున్న ఆకాళ్ళకు జానెడు పొట్టతప్ప ఉత్సాహంలేదు, గమ్యంలేదు. ఆకలి అనే భయంకరమైన, ఆటవికమైన నగ్నసత్యం మాత్రమే శూన్య జీవితంలో మిగిలిన సంతోషం ఇగిరిపోయిన బతుకులవి. ఉప్పెన ఉప్పునమాత్రమే మిగిలిన జీవితక్షేత్రాలవి. వాళ్ళ ఆకలిమీద ఆడుకుంటున్నది ఈవ్యవస్థ, ఈ ప్రభుత్వం.

తలఎత్తి చూసాం, సాయంత్రం కావస్తున్నది, తలతిప్పి చూసాం. చిత్రం! కోతలు కోస్తున్న స్త్రీలు, పురుషులు! అప్పటికే కోతలయి మేటుపడ్డ వరికర్రలు. ఆ

అమ్మలు కోతలు ఆపి మమ్మలను కేకేసారు. అక్కడ ఒక కుర్రవాని శవం. 12-15 సంవత్సరాల మధ్యన వుంటుంది వయస్సు, నెక్కడు పడివుంది. తల, మొండెం ఒక చోట. ఇతర ఎముకలు ఒకచోట పడివున్నాయి. ఉప్పునీరు కాళ్ళుచేతులు తినేసింది. అయితే కూలీలు కోతలకు రావడం లేదన్నమాట నిజంకాదా. అక్కడినుంచి వచ్చి కిరోసిన్, కర్రలకోసం ఎంత ప్రయత్నించీ ప్రయోజనం లేకపోయింది. తిరిగివచ్చే వరకు శ్రీనివాసరావు ఇంటిముందర జనం గుమిగూడి వున్నారు. ఉన్నత పాఠశాల లారీ అక్కడేవుంది.

ఇంక మా ప్రశ్నలు మేం బయల్దేరినపుడు వరంగల్‌లో ఎదుర్కొన్న సవాళ్లు సందేహాలు ఆరంభించాం: "ఏం చూద్దామని వచ్చారు భీభత్సమా- అది అయి పోలేదు వెంగళరావును మానెత్తిన తెచ్చిపెట్టుకున్నాం. మూడు తుఫానులు. మిగిలింది పురుగు తినిపోయింది. ప్రభుత్వం మమ్మలను ధ్వంసం చేస్తున్నది. మురుగు శిస్తువసూలు చేస్తున్నారు. ఎకరానికి 20 రూపాయలు. రెమిషన్ ఇవ్వమనండి. అవనిగడ్డ వంతెన కాడ మొగలో కూర్చొని ఆయన (మండలి వెంకటకృష్ణారావని ఉద్దేశం) అంతా కావ తీవరపల్లి చేరుస్తున్నాడు. పాపం, ఒక్క రవీందర్‌రావు (దివిసీమ గ్రామీణ పేదల సహాయ సంఘం) వుండి కొంచెం సాయం చేస్తున్నాడు. ప్రభుత్వం మాకేమీ చేయడం లేదు విజయవాడ విద్యార్థులు అక్కడ వీధులు ఊడ్చి, గ్రామాల్లో కోతలుకోసి మాకు దుప్పట్లు తెచ్చారు. స్వచ్ఛంద సంస్థలే కొద్దిసాయం చేస్తున్నాయి. ఇక్కడి జనాన్ని ఈ ఇల్లు కాపాడింది' అంటూ ఆ అరవైఏళ్ళ వృద్ధుడు రైతు చెప్పాడు శ్రీనివాసరావు గారి ఇల్లు చూపుతూ.

దింటిమెరక గ్రామస్తుల దగ్గర, ముఖ్యంగా పల్లెకారులు, హరిజనులవద్ద వున్న రేషన్‌కార్డులు చూసాము. 7వ తేదీన 150 రూపాయలు, 17న 50 రూపాయలు, 14న ఒక కిలో బియ్యం, ఒకచీర, ఒకజత పంచె (విధవకు పంచెలు, భార్యను పోగొట్టుకున్నవానికి చీరలు ఇచ్చిన సందర్భాలూ వున్నయి) ప్రభుత్వం యిచ్చింది. ప్రైవేటు వాళ్ళు దుప్పట్లు ఇచ్చారు.

"ఈ ప్రాంతానికి ఇప్పటివరకూ ప్రభుత్వ వైద్యసహాయం రాలేదు. 26న ఒక పూటవచ్చి తిరిగిపోయారు. ఎంతోమంది ప్రైవేట్ డాక్టర్లువచ్చి సమయానికి మందులు ఇవ్వకపోతే ఈ మిగిలిన వాళ్ళంతూడ చచ్చేవాళ్ళమే. కోడూరులో ఒ. పి. డి. ఆర్. వాళ్లు, ఒక హాస్పిటల్ పెట్టారు. ప్రజా వైద్యశాలవుంది. వాళ్ళిచ్చారు మందులు.

"పిల్లలు చచ్చి, ఇళ్లు నాశనమయ్యి ఇప్పుడు చేపలు పట్టడానికి ఎట్లా పోగలం. వలలుకూడ లేవు విసిరే వలలకు 400 గ్రాముల నైలాన్‌దారం కావాలి. మెటల్ కావాలి. అల్లడానికి 40 రూపాయల కూలీ కావాలి. అంతా 130 రూపాయలు అవుతుంది. ఎవరికివాళ్ళు నూలుతీసుకొని కట్టాల్సిందే. మేమంతా కట్టగలం" అని చెప్పారు పల్లెకారులు.

"ఎవరి సాయంవచ్చినా మాలలకు, పల్లెకారులకు అందడంలేదు. ఇటు పైనుంచి వస్తారు. కమ్మారి ఇండ్లలో పంచుతారు. చేతులు దులుపుకొని పోతారు. వాళ్లపెద్దోళ్లు ఏమైనాతెచ్చే మీరూ పెద్దోళ్ళే. కమ్మోరు తమ పిల్లలను కొస్త ఎదిగినవాళ్ళను లారీలకు అడ్డంగా పడుకోబెట్టి అంతా వాళ్ళ ఇళ్ళలో చేర్చుకుంటారు." ఇదీ పల్లెకారుల, హరిజనుల ఫిర్యాదు.

"లాంతర్లు అందరికీ ముట్టినయ్. మాకు ముట్టలేదు. బకెట్లు ముట్టలేదు. శవాలు కాల్చడానికి పుల్లలులేవు. కూనెలేదు, చాల శవాలు సగం సగంకాలి ఊళ్ళో వాసనేస్తున్నది కాలువలోకూడ శవాలింకా వున్నాయి. కోతలుకోస్తుంటే, పొదల్లో, గుబుర్లలో ఇంకా శవాలు వెళ్లతున్నాయి.

"దింటిమెరకలో, 120 పల్లెకారుల కుటుంబాలున్నాయి. 52 మంది చనిపోయారు. తుఫాను వస్తుందని రేడియోలో విన్నాం. గొడ్లు పశువులు పిల్లలను వదిలి ఏటుపోతామని వుండిపోయాం. ఉప్పెన 5 గంటలకు వచ్చింది...

"శవాలు చూడకుండా బతికున్నవాళ్ళను బతికించే ప్రయత్నం చేశాం. ఉప్పెన వచ్చిన రాత్రి బయల్దేరి తెల్లవారి రాత్రి 11 గంటలకు అవనిగడ్డ చేరాం. గాంధీ సత్రం (క్షేత్రం)లో కర్రలతో బయటికి గెంటారు. 24 న రాష్ట్రపతి వచ్చిన నాడు మాత్రం అన్నంపెట్టారు. పచ్చడి వేశారు. అక్కడ కోమట్లు మాత్రం అంతకు ముందు కొంచెం అన్నం పెట్టి ఆదుకున్నారు. సత్రంలో అన్నమయితే వాంతులు, విరేచనాలు.

"ఉన్న అప్పులు రద్దుచేసి, కాంక్రీటు బిల్డింగులు కట్టిస్తే ఉండగలం తప్ప ఇక్కడ వుండేదిలేదు. బతికేదిలేదు. తిండిలేక గొడ్డుచస్తున్నది. వీరుకూడ (శ్రీనివాసరావు ఇల్లు చూపెడుతూ) వెళ్ళిపోతే మేమెవ్వరమూ ఇక్కడుండము ఏడ్వలేక నవ్వుతున్నాం. పిల్లలు, పెళ్ళాలు, తల్లులు, తండ్రులు చనిపోయి ఒంటరితనం పోగొట్టుకోడానికి నలుగుర్లో తిరుగుతున్నాం. ఆ దరిన (మాలపల్లి వున్నవైపు) మంచినీళ్లు లేవు.

మంచినీళ్ళ వ్యానులు ఒకటి రెండురోజులు వచ్చి ఆగిపోయాయి. మేమిట్లా చచ్చిపోయిన సంగతి ప్రభుత్వానికి మూడు నాలుగురోజులదాకా తెలిసినట్లు లేదు. సముద్రం దిబ్బకోసి ఒక మైలు వెనక్కి పోయిందంటున్నారు.

"దాని బలానికి దేశంలో ఏ యంత్రబలమూ సరిపోదు. జనాన్ని చంపాలంటే ఇది ప్రభుత్వానికి సైన్యం, పోలీసులకన్నా మంచి ఆయుధం"

ఈ మాటలు చక్రవర్తివి. వయస్సు 30 దాకా వుంటుంది. కాస్త చదువుకున్న వాడో కాదో కాని రాజకీయ చైతన్యంగల వాడిలాగున్నాడు. 6,3 సంవత్సరాల ఇద్దరు మొగపిల్లలను ఉప్పెనకు బలియిచ్చాడు. 12 గంటల రాత్రిదాకా బతికించుకున్నాడుగాని ఆపైన సాధ్యంకాలేదు. ఆయనగాధ విషాద కెరటంలాగుంది.

"నాకు రేడియోవుంది. అలలు 2½మీటర్ల ఎత్తున లేస్తాయని రేడియోచెప్పింది. కాని అంత ప్రమాదంగా వుంటుందనుకోలేదు. గాలివాన వస్తుందని అనుకున్నాం. తుఫానువస్తే పూరిళ్ళు కూలుతాయి. పూరిళ్ళలో జనం చనిపోరు. డాబాలైతే కూలి జనం చస్తారు. అందుకని మొండిధైర్యంతో గుడిసెల్లోనే వుండిపోయాం. కానివచ్చింది తుఫానుకాదు. వాగ (ఉప్పెన). ఉప్పెన వస్తుందని రేడియోచెప్పలేదు."

అప్పుడింక మధ్యతరగతి వారినుంచి, మేం బయల్దేరేముందు వరంగల్‌లో, ఇంకా ప్రయాణంలో అనోటా అనోటవిన్న సాధారణంగా వినవచ్చే ఫిర్యాదులు అడిగాము. 'మీరు పనులు చేయడంలేదట కదా. కోతలకు వెళ్ళడంలేదట. ఎప్పుడూ రోడ్డుదగ్గరే ఏ లారీవస్తుందా, ఏజీపు వస్తుందా అని కాచుకొని కూచున్నారట. పైసలిచ్చినా వస్తువులిచ్చినా దాచుకొని అడుగుతున్నారట. తాగేస్తున్నారట. మరి మీరు పనులకు వెళ్లకుంటే మీకూ రైతుకూ నష్టమేకదా. ఎంతకాలం మీకీ సాయం వస్తుంది పని చేసుకొని బతకాలి కదా' అని.

"మేం పనిచేయడం లేదన్నమాట పెద్దపెద్దవాళ్ళు కల్పించే స్టాకుమాట. మేం రైతుల దగ్గర అప్పులు తెచ్చుకున్నమాట నిజమే. కోతల కాలంకోసం ఎదురుచూస్తూ కోతలకు వెళ్ళాలనికూడా అనుకున్నాం. ఇంతలో ఈ ఉప్పెన వచ్చింది. మా పిల్లలు పోయారు. మా ఇళ్లు పోయాయి. నావరకు నాకు ఇద్దరు కొడుకులు పోయారు. నేనూ నా భార్య మిగిలాం. మాకు ఒకటి రెండు ఎకరాల పొలం వుంది. మా పొలాలూ కోసుకోవాలి. అయినా ఎప్పుడూ రైతుల పొలాలు కోసే మా పొలాలు

కోసుకుంటాం. ఈసారీ అలాగే చేస్తాం. కాని పిల్లలను ఇళ్లను పోగొట్టుకొని పనికి పోవడానికి మాకు చేతులెట్లా ఆడుతాయి, నాన్నా అమ్మా అంటూ మాచుట్టూ తిరిగే పిల్లలు లేకుండా కంచం దగ్గరికి పోతే ముక్క నోట్లోకి పోదు. మేం పీట్ల వాళ్లు యిచ్చే బిచ్చానికి ఆశపడిలేం. కష్టపడి బతకాల్సిన వాళ్ళమే.

"ఇంక తాగుతున్నామన్న ఆరోపణ. తాగేవాడు ఉప్పెనకు ముందు తాగాడు. ఇప్పుడూ తాగుతున్నాడు. ఇప్పుడు భార్యాబిడ్డలు పోయి బాధలో మరింత ఎక్కువ తాగవచ్చు ఇదివరలో పెళ్లాంమెళ్ళో పుస్తెపూలు అమ్మికూడా తాగినవాళ్ళున్నారు. ఇప్పుడు అలాంటివాళ్ళు ఏ వస్తువిచ్చినా అమ్ముకోవడంలో, డబ్బులిచ్చినా వెంటనే సారా కొట్లోకి వెళ్ళడంలో ఆశ్చర్యమేమున్నది? ఇదివరలో తాగనివాళ్ళు ఈ సాయం వల్ల కొత్తగా నేర్చుతున్నారా? ఇన్ని బాధల్లో వున్నా మాలో ఎవరమూ తాగడంలేదే" అని తనచుట్టూవున్న ఇరవైమంది పల్లెకారు యువకులను చూపుతూ ఎదురు సవాల్ చేసాడు చక్రవర్తి. అతని కంఠంలోని స్పష్టత అతని ఆలోచనల్లోని నిశితత్వం మమ్ములను ముగ్ధులనుచేసింది. అతణ్ణి మళ్ళీ కలుసుకొని ఇంకా వివరంగా ఇంటర్వ్యూ చేయాలనుకున్నాం, వీలుకాలేదు. తెల్లవారుతూనే అరలిటర్ కిరోసిన్‌కోసం కోడూరుకు వెళ్తూ కనిపించాడతను.

కోతలకు వ్యవసాయ కూలీలు వెళ్ళడంలేదనే విషయానికి శివనాదం ఇంకా బలమైనసమాధానం చెప్పాడు. అయితే ప్రవాహ సదృశమైన ఆయన సంభాషణను రికార్డు చేయడానికి టేప్‌రికార్డర్ వుంచే తప్ప కాదు. శివనాదం దీవిమొరక మాలపల్లినుంచి అరవై, డెబ్బై మందిని చల్లపల్లి శ్రీనివాసరావు ఇంటికిచేర్చి కాపాడాడు ఉప్పెన రాత్రి. ఆ 'ఎదురీత'లోనే (ఏటికి ఎదురీది ఎందరినో కాపాడి తనభార్యా పిల్లలను పోగొట్టుకున్న కమ్యూనిస్టు కార్యకర్తలు మాకు ప్రతిగ్రామంలో ఒకరిద్దరు కనుపించారు.) తనకళ్ళముందే భార్యాబిడ్డలు అసహాయంగా కొట్టుకపోవడం చూసాడు. కాలిపై గాయంతో, స్పృహతప్పి తెల్లవారి ఎక్కడో కళ్ళుతెరిచాడు. మేం కలిసినపుడు కాలిపై ఇంకా గాయముంది. గ్రామాలన్నీ సహాయ కార్యక్రమాల్లో అలసటలేకుండా తిరుగుతున్నాడు. ప్రభుత్వం నుంచి రావల్సిన సహాయాన్ని డిమాండ్ చేయడానికి ప్రజలను సంఘటితపరిచే కార్యక్రమంలో వున్నాడు

"భూస్వాములు బ్యాంకులు, ప్రభుత్వాలు ఇచ్చినబాకీలు రద్దుచేయాలని, పన్నులు రద్దుచేయాలని, రాయితీలు, సబ్సిడీలు ఇవ్వాలని అడుగుతూనే రైతులు మరోవెంపున

కార్తీకమాసంలో వ్యవసాయకూలీలకు కోతలకోసం అప్పుపెట్టిన ముప్పై, నలభై రూపాయలు తిరిగి రాబట్టుకోవడానికి కోతకు రమ్మంటున్నారు. ఇదేం న్యాయం? ఈ కూలీలకు రైతులు ఇచ్చిన అప్పులు మాత్రం రద్దుకావద్దా? అందుకే మేం బ్యాంకుల అప్పు. ప్రభుత్వ అప్పులు రైతులకు రద్దుకావాలంటున్నాం అట్లాగే లేబరుకు రైతు పెట్టిన అప్పుకూడ రద్దుకావాలి. అసలు రైతుల అప్పులు రద్దుచేయాలని వాళ్ళకోసం తహసీల్‌ల ముందు. కలెక్టరాఫీసుల ముందు ఆందోళనలు ప్రదర్శనలు చేసేది, సాధించేది మేమే. వ్యవసాయ కూలీలమేకదా. మా సహకారం, పోరాటం లేకుండా రైతు మాత్రం ఏం సాధించుకోగలడు.

"అయినా మేం మొండిగా అప్పు ఎగ్గొడతాం అనలేదు. ఈ సీజన్‌కు కోతలకు రాలేం. పిల్లాజెల్లా ఇల్లూగూడూ పోగొట్టుకొని పుట్టెడుదుఃఖంలో వున్నాం. కార్తీక మాసంలో తీసుకున్న అడ్వాన్సుకు వచ్చేసీజనులో మళ్ళీ డబ్బులడుగకుండా కోసిపెడతాం. మీ అప్పు మాపైన ఉంచుకోండి- అని ప్రాధేయపడ్డాం. కాని రైతులువినలేదు మామీద దాడిచేసారు. ఇదిగో ఇట్లా అబద్ధపు నిందాప్రచారం చేస్తున్నారు." అని ఆవేశంగా చెప్పాడు శివనాథం.

కాబట్టి కోతలకు వ్యవసాయ కూలీలు రావడంలేదన్నది. సైకలాజికల్ (మానసిక షాకు) సంబంధించిన సమస్య. అయినా కోతలు జరుగుతూనే వున్నాయి. మేం తిరిగిన మేరకు కోతలు పూర్తి కావచ్చాయి. ప్రతిగ్రామంలో కోతలకువస్తున్న వ్యవసాయ కూలీలు మాకు ఎదురుపడ్డారు. కోతలుకోస్తుంటే శవాలు బయటపడినచోట ఆమేరకు కోయకుండా వదిలిపెడుతున్నారు.

ఇంక మూడోవాదన- మధ్యతరగతి కుటుంబాలకు సాయం అందడంలేదన్నది ఎంత అబద్ధమో, నిజానికి పల్లెకారులకు హరిజనులకు, ఊరిబయట, దూరంగా రోడ్డుకు అంటే సాయం తెచ్చే లారీలకు, జీపులకు దూరంగా విసిరివేయబడి వున్నవాళ్ళకు అందడంలేదన్నది మాకళ్ళతో మేం ప్రత్యక్షంగా చూసాం. ఆ ఉన్నతపాఠశాల లారీ నిండా తెచ్చిన సరుకు హరిజనులకు, పల్లెకారులకు అందలేదు. దానిమీద అర్దాన్ అనే పల్లెకారు యువకుడు చాల అల్లరిచేసాడు. వసుమతిగారు కూడ ఆతెచ్చినవారిలో బాధ్యులతో ఊరిసంగతి, అవసరాలు తెలియకుండా ఊరకపంచిపోవడం ఎంత నిరర్థకమో గట్టిగా మందలించింది. తమకు ఇంటికితెచ్చిచ్చిన వస్తువులన్నీ వాళ్ళ పల్లెకారులకు, హరిజనులను ఇచ్చేస్తున్నారు.

తెల్లవారి 18వ తేదీ ఉదయం దింటిమెరకలోనే ఇంకా రెండుమూడు శవాలుకని పించాయి. అసలు శవాలగురించి ప్రజలిట్లాగే షికాయత్ చేస్తే ఒక విచిత్రం జరిగింది. అంతటా ఇంకా శవాలు వున్నాయని అవనిగడ్డలో అధికారులకు చెప్తే, ఈ చెప్పే వాళ్ళంతా అల్లరిమూక అవి శవాలని గొడవచేస్తున్నారని వీరిలో ముగ్గురిని అరెస్ట్‌చేయ మన్నాడట అధికారి. తర్వాత దబాయింపుగా 'ఏవీ శవాలుంటే నాతోవచ్చి చూపించండి' అని జీపులో వాళ్ళను కూర్చుండబెట్టుకొని భావదేవరపల్లివైపు తీసుకపోయాడట. ఆ అధికారి ఉద్దేశం అది మంత్రిగారి ఊరుగనుక అక్కడ అప్పటికే శవాలు అన్నీ తీసి వేసివుంటారని. జీపు ఊళ్ళో ఆగగానే ఈ కార్యకర్తలు దూరంగావున్న మాలవాళ్ళను పిలిచి 'ఇక్కడ శవాలు ఏమైనా వున్నాయా' అని బెరుకుబెరుకుగానే అడిగారట. ఎందుకంటే మంత్రిగారి ఊరుగనుక ఇక్కడ ఉండకపోవచ్చుననే వాళ్ళు ఊహించారు. 'ఎన్నో ఉన్నాయ'ని ఆ హరిజనులు తీసుకపోయి చూపించారట. (భావదేవరపల్లి మాలపల్లిలో ఇప్పటికి అంటే 24-12న కూడ శవాలున్నాయి.)

సరే, ఇంక అటునుంచి కోడూరు ఫిర్కావైపు వస్తే చెప్పనే అక్కర్లేదు. అప్పుడు రోడ్డు వెంబడి అంతటా శవాలే. నవంబర్ 24 తేదీన కోడూరు దింటిమెరక కాలువ గట్టున శవాలు వరుసగా పడివుంటే ఆ వాసన భరించలేక పరుగెత్తి వచ్చామని హైదరాబాద్ నగర ఒపిడిఆర్ కార్యదర్శి జమున అమె నెల రోజులుగా ఆ ప్రాం చెప్పింది తాలలో పనిచేస్తున్నది.

18న శ్రీరాంపురం వెళ్ళాం. దింటిమెరక నుంచి కాలువ వెంట వెళ్తే మూడు మైళ్ళు వుంటుంది. చక్కగా లారీలు రావచ్చు కాని ఎందువల్లనో ఈ ఊరు కావల సిన తాటికమ్మలను తోవలో వదిలేసిపోయింది ప్రభుత్వ లారీ. ఊరు మొత్తంగా నాశనమయింది. 248 మంది చనిపోయారు. 53 మంది మిగిలారు. కేవలం 6గురు స్త్రీలు మిగిలారు. ఈవూరి కార్యకర్త కొన్ని ప్రాణాలు కాపాడిన శివయ్యకు నలుగురు పిల్లలు, భార్య దక్కకుండా పోయారు బాజ్జీ అనే కార్యకర్త మొత్తం కుటుంబం, ఇల్లు నాశనమయ్యాయి. జాలర్ల కుటుంబానికి చెందిన రఘురామయ్య కుటుంబమూ అంతే. ఈ వూళ్ళో సరోజినీ అనే టీచర్ వుండేది. ఆమెకు ప్రజలే ఇల్లువేసిచ్చారు. ఆమె పోయింది, ఇల్లూ పోయింది.

ఇది ఇట్లా వుంటే ఉప్పెన తరవాత తమ రేషన్లు తెచ్చుకోవడానికి గ్రామస్తులు అవనిగడ్డ, కోడూరుకు వెళ్తే దిగుతనున్న మండలి వెంకటకృష్ణారావు మనుషులువచ్చి

మిగిలిన మా వస్తువులు ఎత్తుకపోయారు.— అని కొన్ని వ్యవసాయ పరికరాలు తాము తిరిగి పోరాడి తెచ్చుకున్నవి చూపారు.

కొంతమంది మిత్రులు (భవానీ అనే సినిమా కంపెనీకి చెందినవాళ్ళు) ఇక్కడ 30 షెడ్డులు వేసారు. లైట్‌రూఫ్ (తేలిక రేకుకప్పు) ఈ పాకలు ఇంకాస్త ఒత్తుగా మిదతేస్తే బాగుండేది. వీళ్లకు చెప్పాలి. ఇపుడిస్తున్న, ఇవ్వగల వస్తువులు పెట్టుకోవడానికి పెట్టెలు కావాలన్నారు. శివయ్య ఇలా చెప్పాడు— "నాకు భార్య ముగ్గురు పిల్లలు పోయారు. ఈ ఊళ్ళో 17 మంది అచ్చాడిలాంటి యువకులు పోయారు. మేం ఎన్నో వూళ్ళకు పోయి రక్షించాం. 45 మంది నా ఇంట్లో బతికారు. ఇప్పుడేంచేస్తే ఏం ప్రయోజనం. మొదట హెచ్చరిక లేదు. తుఫాను అనుభవం మాకుందిగాని, ఉప్పెన గూర్చి ఎవరూ చెప్పలేదు. అసలు రేడియో భాషమాకు అర్థమయితేగదా. మేం వాగొచ్చింది అంటున్నాం. రేడియో తుఫాను అనిచెప్తుంది. ఇప్పుడు రేషన్ ఇవ్వడంకూడ అదే అధ్వాన్నస్థితిలో వుంది. కె. జి ఇవ్వమని పైనుంచి ఆర్డర్‌వుంటే అరకేజి ఇస్తున్నారు ఇదిగో కొక్కిలిగడ్డ వెంకయ్య. భార్యా ముగ్గురు పిల్లలుపోయి పతితపిలించి తిరుగుతున్నాడు"

ఈ రెండు ఊళ్ళ పర్యటనలోనూ మేం కొట్టవచ్చినట్లు ఒక విషయం కనుక్కున్నదేమంటే— మనభాష, మన సంస్కృతికూడ ప్రజలకు దూరమయింది కావడంవల్ల ఎంత ప్రమాదమో. వ్యవసాయ కార్యక్రమాలని, ఆయారుతువుల్లో సలహాలని ఇస్తారు కదా— అవి మాకేమీ అర్థం కావన్నారు ఇక్కడివాళ్ళు "బొన్నలు, లీటర్లు అనేమాటలు చెప్తారు. మేమేమో దణ్ణమూతలు, కడవలు వాడుతాం ఎట్లా అర్థమైచస్తుంది. అట్లాగే వాగ అనేమాట ఉప్పెనకు వాడుతాం. వాగొస్తుంది అంటే తగు జాగ్రత్తలు తీసుకునేవాళ్ళం. కనీసం ఉప్పెన అన్నా తెలిసేది. తుఫాను వస్తుందని చెప్పింది రేడియో. మేం తుఫాను జాగ్రత్తలు తీసుకున్నాం. గుడిసెలకు కర్రలు పాతాం. గుడిసెలపై వలలువేసాం. పూరిగుడిసెలు కుంగిపోయినా అందులో కమ్మినట్లు వుంటామనుకున్నాం. కాని వచ్చింది ఉప్పెన. రేడియో హెచ్చరించి మాత్రం ఏంలాభం. జీవుల మీదవచ్చి చెప్పారన్నది వచ్చి అబద్దం. మమ్మలను మెట్టప్రాంతాలకు చేర్చడానికి, రక్షించడానికి ప్రభుత్వమేమీ చేయలేదు."

అక్కడినుంచి కొంచెం వెనక్కివచ్చి ఎడమచెయ్యివైపు సూటిగా నాలుగుమైళ్ల నడిచాం. దూరాన తెల్లటిమేడలవలె మెరుస్తూ ఒకపట్టణంలా కనిపించింది. ఆవైన

కృష్ణ— ఇంకొకవైపు సముద్రం. అసలు నీళ్లులేకుండా నీళ్ళువున్న భ్రమ ఒకవైపు— ఎండమావిని. ఇక్కడ వీళ్ళు అగ్గితెమ్మెర అంటారు.

ఇక్కడ రోడ్డువేస్తున్నారు. ప్యాంట్లుమలచి బాగా మాసిపోయిన బట్టలతో, గడ్డాలతో నిద్రలేనికళ్ళతో విద్యార్థులు. వెంట ఆ ప్రాంతాలకే చెందిన లేబర్. ఆవిద్యార్థులు తమనుతాము పరిచయం చేసుకున్నారు. జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ రాడికల్ స్టూడెంట్సు సెంటర్ విద్యార్థులు. విరసంవాళ్లు వచ్చారని ముందే ఒపిడిఆర్ కార్యకర్తలతో వినివున్నారు. మాకోసం ఎదురుచూస్తున్నారు. కాని పనిలోనేవున్నారు. దింటిమెరకలో కోతలుకోస్తున్న వ్యవసాయకూలీలను, పిల్లలనుకూడ చూసాం. ఇక్కడ రోడ్డుపనిలో నిమగ్నమై ఉన్న లేబర్‌ను, పిల్లలనుకూడ చూసాం. అంటే పనివుంటే ప్రభుత్వం పనిఇస్తే ఒళ్ళుదాచుకోవడానికైనా, యాచించడానికైనా ఈ జనం, ఈ కష్టజీవులు, ఈసముద్ర సంతానం ఈనేల తల్లిబిడ్డలు, ఈ సూర్యుని పిల్లలు, ఆకాశ ఆశ్రితులు— ఏమాత్రం సిద్ధంగాలేరు. కాని ఎన్నికల పనితప్ప ఏపనీలేని ప్రభుత్వానికీ, పార్టీలకూ ఉప్పెనకూడ ఒక ఎన్నికల సమస్యే అయింది.

(పాలకాయతిప్ప, గొల్లపాలెం మొదలయిన గ్రామాల గురించిన రిపోర్టు వచ్చే సంచికలో)

---

## విరసం మహాసభలు ఏప్రిల్‌కు వాయిదా

కోస్తా ప్రాంతాలు ఉప్పెన, తుఫానులకుగురియై ఎనలేని ప్రాణ, ధన నష్టానికి ఎరయైనందున చీరాలలో జనవరిలో జరుగవలసివున్న విరసం మహాసభలు ఏప్రిల్‌కు వాయిదాపడినవి.

— కార్యదర్శి, వి.ర.సం.

---

'ఆమె ఈదేశాన్ని ప్రేమించింది'— శివసాగర్, మేరీటేలర్ 'భారతదేశంలో నా జెయిలు జీవితం' పరిచయం వచ్చే సంచికలో.

---

## చార్లీచాప్లిన్

కళాత్మక విలువలకు, వ్యాపార విలువలకు మధ్య రాజీపడలేక నిశ్శబ్దంగా కన్ను మూశారు ప్రఖ్యాత చలనచిత్ర దర్శకులు బి. ఎన్. రెడ్డిగారు 1977 నవంబర్లో, డిసెంబరులో ప్రఖ్యాత చిత్రనటుడు చార్లీ చాప్లిన్ మరణించారు.

వినోదసాధనంగా రూపుదిద్దుకున్న సినిమాను కళాత్మకంగా తీర్చిదిద్దేందుకు వేర్వేరు దృక్పథాలతోనే అయినా యీ ప్రముఖులిద్దరు ఎంతగానో తోడ్పడ్డారు.

తలిదండ్రులు నటీనటులయినా అతిబీదరికంలో తల్లి ప్రేమతప్ప మరేఆలంబన లేని చాప్లిన్ ఏబడిలోను పాఠాలు చదవకపోయినా జీవితపాఠాల్ని అనుభవాలబడిలో ఒంటబట్టించుకున్నాడు. కావాలని స్టేజి ఎక్కలేదు. స్టేజిమీద తల్లిగొంతుమూగబోయి అపహాస్యంపాలైతే పసి చాప్లిన్ స్టేజిఎక్కి పాటపాడి తల్లిని ఆదుకున్నాడు. అలా స్టేజిఎక్కినవాడు నటనకే అంకితమయాడు.

పసితనంనుండి అతను పడిన కష్టాలకు అంతులేదు. కన్నబిడ్డల్ని పోషించుకో లేక తల్లికి పిచ్చెక్కిపోతే అనాథశరణాలయాల్లో అతినికృష్ట పరిస్థితుల్లో పెరిగాడు చాప్లిన్. దరిద్రపు ఆఖరి అంచుదాకా ప్రయాణంచేశాడు. పసివయసులో కావల్సిన ఆలన పాలన తిండి తిప్పలు ఏమీ లేక అడ్డమైన పనులు చేసి ఎలాగో బతికిబట్టకట్టిన చాప్లిన్ సమాజంలోని అసమానతలను తనలాటి నిరుపేదబతుకుల కన్నీళ్ళను చాలా స్పష్టంగా అర్థంచేసుకున్నాడు. అందువల్లనే తమాషాకోసం జనంచూచే సినిమాలలో వాస్తవిక జీవిత చిత్రణ చూపించాడు. అంతటి ఆవేదనలోంచి వచ్చాడుగనకనే అతని చిత్రాల్లోని హాస్యం హృదయాన్ని ముక్కలుచేస్తుంది. అది హాస్యంకాదు. హాస్యంలా కనిపించే కరుణ. దానిద్వారానే అతను సాంఘిక చైతన్యాన్ని ప్రేరేపించాడు. మానవతావాదాన్ని ప్రచారంచేశాడు. ఆశావాదాన్ని మొలకెత్తించాడు. అతని సినిమాలు చూస్తూ కడుపుబ్బ నవ్వుతాం. బలబలా కన్నీరు కారుస్తాం. ఈ రకమైన చిత్రాలు నిర్మించడంలో చాప్లిన్‌కి దీటైనవారులేరు.

ఒదులు పాంటు, బిగుతు చొక్కా, చింకి బూట్లు, చేతికర్ర, అపకతవక అడు గులు, ఫ్రెంచికటింగ్ మీసం— విచిత్ర వేషధారణ— తర్వాత సర్కస్ లఘూన్లు, రాజ్‌కపూర్ 'మేరానామ్ జోకర్' లోను యీ వేషాన్ని అనుకరించారు కూడ.

మూకీ చిత్రాలు అంతమయాక కూడా డైలాగులేకుండానే హావభావాలతో తను చెప్పదలచుకున్న దాన్ని ప్రేక్షకుల కందించాడు. అందువల్లనే "సినిమాలలో ఏకైక మేధావి" అని పేరుతెచ్చుకున్నట్టి. పెరిగిన సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రతిభావంతంగా వాడుకోనందుకు "పసివాడు" (దికిడ్) అనికూడా అనిపించుకున్నాడు.

చాప్లిన్ తీసిన 'దికిడ్'లో బతుకుతెరువు కోసం తండ్రికొడుకుల పాట్లు చాలా వాస్తవికంగా వుంటాయి. కొడుకు ఇళ్ళ కిటికీల గాజుతలుపులు పగలగొడితే, వాటిని

బాగుచేసి పొట్ట గడుపుకోవడం తండ్రి వృత్తి— ఆటలాడుకుంటున్నట్టు నటిస్తూ చిన్న గులకరాయితీసి కిటికీవేపు విసరబోతున్న కొడుకుచేతికి వెనగ్గా పోలీసు యూనిఫారం తాలూకు బొత్తాం తగిలి ప్రమాదం పసికట్టి ఆ రాతినే బంతిలా ఆడుకుంటూ కుర్రాడు ముందుకుసాగే దృశ్యం అద్భుతం. 'శతకోటి దరిద్రాలకు అనంతకోటి వుపాయాలు'

ఇలాంటి చిన్న సంఘటనలతో దరిద్రపులోతుని, కడుపుమంట తీర్చుకోవడానికి జనంపడే అవస్థలను కళ్ళకు కడతాడు చాప్లిన్. "ఆకలిమంటలు మనిషిని మనిషి దోచుకోవడం అధికారంకోసం అందరిని ఆహుతిచేసే నియంతృత్వంలాంటి దుర్దశలు లేని మరోప్రపంచాన్ని నిర్మించుకుందాం" అంటారు చాప్లిన్.

'లైమ్‌లైట్' 'సర్కస్'లాంటి చిత్రాలు ఎన్నో తీశాడు. కాని 'ది గ్రేట్ డిక్టేటర్'లో చాప్లిన్ మాటలునేర్చాడు. యుద్ధోన్మాదాన్ని ఫాసిజాన్ని తీవ్రంగా విమర్శిస్తూ తీసిన యీ చిత్రం 1940 నాటిదైనా 1977 నాటికూ్కడా మనకు నిత్యనూతనంగా తోస్తుంది. నిన్న మొన్నటి ఇందిరాగాంధీ, గోబెల్స్‌లాటి శుక్లా బారువాలను 'ది గ్రేట్ డిక్టేటర్'లో యివేళ పోల్చుకోగలం. ఈ చిత్రాంతంలో చాప్లిన్ యిచ్చిన వుపన్యాసం అద్భుతమైనది.

"ప్రజలారా! సైనికులారా! మీరు మరలుకాదు మనుష్యులు స్వేచ్ఛ అంతా తనొక్కడే అనుభవిస్తూ బానిసత్వాన్ని మననెత్తినరుద్దే నియంతలను మీరు బలపరచ వద్దు. మనమంతా ఏకం కావాలి. ఎక్కడైతే ప్రతిమనిషికీ పని, యువతరానికి మంచి భవిష్యత్తు, ముసలితనంలో రక్షణ వుంటాయో— అటువంటి ప్రపంచాన్ని నిర్మించుకుందాం." అని వుద్బోధిస్తాడు.

హిట్లర్ ప్రపంచాన్నంతటిని తనచేతిలోకి తెచ్చుకోవాలని కలలుకంటున్న విషయాన్ని చిత్రీకరిస్తూ నియంత రబ్బరు బెలూన్‌ని భూగోళంలా భావించి దానిని వశపరుచుకుంటున్నట్టు చేసిన నృత్యం, అది పగిలిపోగా అతని భంగపాటు చాలాగొప్పగా చిత్రీకరించాడు చాప్లిన్.

'ది గ్రేట్ డిక్టేటర్'లో తన ద్విపాత్రాభినయం గురించి చాప్లిన్ మాటాడుతూ (ఈ చిత్రంలో హిట్లర్, యూదుమంగలి పాత్రలు యితను పోషించాడు.)

"నియంతగాను, మామూలు మనిషిగాను నటిస్తున్నపుడు, ఒకటి హాస్యపాత్ర, మరోటి విషాదపాత్ర అయినప్పటికీ, రెండిటిమధ్య తేడా నేనేగుర్తించ లేకపోతుండే వాడిని" అంటాడు.

ఇందువల్లనే చాప్లిన్ "కరుణరసాన్ని ఏమాత్రం పొంతనలేని హాస్యరసంతో జోడించ" గలిగాడు.

అయితే చాప్లిన్, తన వృద్ధాప్యంలో, ఇంగ్లీషు రాజరికం 'సర్' బిరుదు దయదలిస్తే దాన్ని స్వీకరించడం పంటికింద రాయిలా తగులుతుంది మనకు.

కాని, మానవతావాది చాప్లిన్ లోకంలో కన్నీళ్ళను, బాధను పలికిస్తూనే జనం నిరాశావాదంలో పడకుండా ఆశతో జీవించే భావాన్ని హత్తుకునేలా చిత్రిస్తాడు. అదే అతను లోకానికిచ్చే సందేశం. చాప్లిన్ చిత్రాలు 16 మి. మీ. లలో పూర్తిగా ప్రదర్శించే ఏర్పాటు వుంటేగాని చాప్లిన్ని ఈతరం వారుకూడా అర్థం చేసుకుని అనుభవించే అవకాశం రాదు.

—కృష్ణాబాయి

## రాజకీయ ఖైదీలపై సినిమా : విరాళాలకై విజ్ఞప్తి

1972-74 బీహార్ వుద్యమంపై 'విప్లవ అలలు' (Waves of Revolution) అనే సినిమా నిర్మించిన ఆనంద పట్వర్ధన్ ప్రస్తుతం రాజకీయ ఖైదీలపై ఒక చిత్రం నిర్మిస్తున్నారు. చిత్రంపేరు 'మనస్సాక్షి ఖైదీలు' (Prisoners of Conscience).

అత్యవసర పరిస్థితి ఎత్తివేయబడిన తర్వాతకూడ మనదేశంలో వేలాది మంది రాజకీయ ఖైదీలు జైళ్ళలో యింకా మ్రగ్గుతున్నారనే సత్యాన్ని చాటిచెప్తుంది ఈచిత్రం. జైళ్ళలోవున్న పరిస్థితులను, పోలీసుల చిత్రహింసలను, దుర్మార్గాలను బట్టబయలు చేసి పౌరహక్కుల వుద్యమాన్ని ఈచిత్రం పరిచయం చేస్తుంది. జయప్రకాశ్ నారాయణ్, మేరీ టేలర్, దేవనాథన్, వాసంతిలతో తాము జరిపిన యింటర్వ్యూలను పట్వర్ధన్ చిత్రీకరించారు. నిధులు సమకూరితే, యింకా యితర రాజకీయ ఖైదీలతో యింటర్వ్యూలు జరిపి వాటినికూడ చిత్రీకరించాలని ఆయన పథకం. చిత్ర నిర్మాణం పూర్తి కావడానికి కనీసం ఇరవై వేల రూపాయలు కావాలి.

పౌర హక్కుల వుద్యమంపై ఈ చిత్రం వెలుగు ప్రసరింపజేస్తుంది. కాబట్టి పి. యు. సి. ఎల్. (ఢిల్లీ) నిధుల సేకరణలో తోడ్పడే బాధ్యత తీసుకున్నది. విరాళాలు పంపించవలసిందిగా ప్రజాస్వామ్య వాదులందరికీ, అన్ని సంస్థలకూ, గ్రూపులకూ విజ్ఞప్తి చేస్తున్నాం.

దాతలు డా. సుదేశ్ వైద్, (యాక్టింగ్ సెక్రెటరీ పి.యు.సి.ఎల్) డి-2 స్టాఫ్ క్వార్టర్స్. ఇంద్రప్రస్థ స్త్రీల కళాశాల, ఢిల్లీ- 54 అన్న చిరునామాకు క్రాస్ చేసిన చెక్కులు పంపాలి చెక్కులపై PUCL, Delhi ('Prisoners of Conscience' film) అని రాయాలి.

—విష్ణుదత్
కన్వీనర్
పౌరహక్కుల పరిరక్షణ ప్రజాసమితి
(పి.యు.సి.ఎల్) ఢిల్లీ విభాగం

